# హనుమత్ప్రబంధము

కవిశేఖర, భారతీప్రసన్న

## కొండేపూడి సుబ్బారావు



శ్రీ రామాయనమః

# శ్రీ హనుమత్ప్రబంధము

## ప్రథమ భాగము అయిదు ఆశ్వాసముల పద్య కావ్యము

జననము నుండి సముద్ర లంఘనమునకు ఉద్యుక్తుడగు వరకు

శ్రీ హనుమంతుని చరిత్రము


రచన

"కవిశేఖర" "భారతీప్రసన్న"

**కొండేపూడి సుబ్బారావు**



'ప్రసన్న భారతి' గ్రంథమాలా ప్రచురణ

47-10-5, ద్వారకానగర్, విశాఖపట్టణము - 530 016

ఇండియా

**HANUMAT PRABANDHAMU**
An epic in classical style poetry
Volume I, in five cantos

*by*
*"Kavisekhara", "Bharatee Prasanna"*
**KONDEPUDI SUBBA RAO**

47-10-5, Dwaraka Nagar,
VISAKHAPATNAM - 530 016 (India)
☎ 0891-54531



Price : Rs .35
Overseas Price : $ 5.00

Cover Design : BAPU

First Edition:
12 May 1996,
*Hanumat Jayanthi,*
*Dhata Nama Vatsara Vaisakha Bahula Dasami*

*Typesetting at:*
SAI KRUPA GRAPHICS
(Near Sankar Mutt)
VISAKHAPATNAM 530 016, Ph: 595241

*Printed at:*
RAMSHA-SIRIESHA PUBLICATIONS
SAMALKOT-533 440, Ph: (08852) 27474, 27454

Copies can be had from:
* Author (at the above address)
* Visalandhra Book House (All Branches)

# భూమిక

ఆంజనేయుడు భారతీయు లెల్లరకు ఆరాధ్య దైవము. ఆంధ్రులకు అభిమాన దేవతామూర్తి. ఈశ్వరాంశతో అంజనావాయుపుత్రులకు జన్మించిన వరపుత్రుడు. సర్వదేవతామూర్తి, త్రిమూర్త్యాత్మకుడు, సర్వజనరక్షకుడు, అభయప్రదాత అని ఆమహనీయుని ఎన్నియోరీతుల కీర్తింతురు ''ఆంజనేయ'' ''హనుమ'' అను నామములలో పరమాత్మ తత్త్వప్రకాశము కలదనియు ప్రతీతి.

ఆంధ్రదేశములో ఎంత కుగ్రామమైనను నాలుగు బాటలు కలియుకూడలిలో ఉన్నతముగు ఆంజనేయ విగ్రహమును నిలిపి పూజలు సేయుదురు. అందరికిని అందుబాటులో నున్న దైవస్వరూపము హనుమంతుడు. ఆరూపమునందున్న ఆకర్షణ, మహిమ అట్టివి. ఆ దేవునికున్న గుణ గణములా! మఱియెక్కడను లేవని అనిపించును. నిరుపమాన ధైర్య బలసాహసములు వేదశాస్త్ర విద్యాభ్యాసము గురుభక్తి కార్యదీక్ష రాజనీతి ధుర్యత బ్రహ్మచర్యము మహాశౌర్యము పరోపకారము; మీదు మిక్కిలి ఆయన ప్రవర్తనయందు వ్రేలెత్తి చూపుటకు ఒక అణువైన దోషము కన్పింపని పవిత్ర వర్తనుడు. మన దేవతావ్యవస్థలో ఒక విశిష్టరూపము ఆంజనేయుడు. అందుచేతనే విష్ణ్వంశసంభూతుడగు శ్రీరామునికినమ్మిన బంటు అయినాడు. హనుమంతుని రామభక్తి అపారము, ఆయన జీవితము సర్వము రామమయము. శైవవైష్ణవ మాధ్వత్రిమతానుయాయులకు సమముగ ఆరాధనీయుడు హనుమంతుడు.

పుణ్యమూర్తులను స్మరించుట వారి చరిత్రములను వినుట చదువుట మనోవికాసము కలిగించి హృదయ నైర్మల్యము నొసగును. ఇందులకే మన జాతిలో ఆచారముగ వచ్చుచున్న పురాణ పారాయణము పురాణ శ్రవణము హరికథలు మున్నగునవి. వానరుడై జన్మించిన నేమి అన్ని విధముల దేవతలకన్న మిన్నయయిన దివ్య ప్రభావుడు ఆంజనేయుడు. కనుకనే విఘ్నేశ్వరునితో ప్రారంభించిన నిత్యదైవ ప్రార్థనలను ఆంజనేయుని స్తుతించిగాని పూర్తి చేయము. రాత్రులందు నిదురకు పోవుముందు హనుమంతుని స్మరింతుము. హనుమత్ దేవుని స్తుతి సకలభయనివారకము, సకల ప్రయత్న విజయ సాధకము. ఆదేవుని గుణములు, ఎన్నియుగములు చెల్లినను సమాజమునకాదర్శప్రాయములు శ్రేయోదాయకములయి విలసిల్లుచున్నవి. మఱియెన్ని యుగములైనను ఇట్లే విలసిల్లును.

ఈ యీ కారణములే ఈహనుమత్ప్రబంధ కావ్యరచనకు నన్ను ప్రేరేపించినవి. హనుమద్దేవుని చరిత్ర విశేషములు అటనటనున్నవి సేకరించి వ్రాసితిని. ఇది ప్రథమ భాగము. హనుమంతుడు సముద్రలంఘనమునకుద్యుక్తుడగు వరకు కథ యిందున్నది. శ్రీరాముని పట్టాభిషేకము వరకు రెండవ భాగము. సీతాదేవి యొద్ద హనుమంతుని ఆధ్యాత్మిక తత్త్వ చర్చ హనుమంతుడు చూపిన మహిమలు మూడవ భాగమున వచ్చును. ఈ కథలు చాలవరకు

పరాశర సంహిత యందున్నవి. నిస్స్వార్థులయిన పూర్వమహాఋషులిట్లు మహనీయుల చరిత్రములను మానవ శ్రేయమునకై వ్రాసినవి కోకొల్లలు. నిజమునకు మన పురాణములన్నియు ఇహ పరపరమార్థప్రదములు జగద్ధితములు. పాశ్చాత్య నాగరికతా ప్రభావమున పడిన మన ఆధునికు లీసత్యమును గ్రహింపగలరని నా విశ్వాసము.

సర్వవిధముల ప్రయోజన ప్రదమగు శ్రీ ఆంజనేయుని చరిత్రము మనోరంజకమగు కావ్యరూపమున ఆంధ్రుల కందజేయువలయునను తలంపుతో ప్రారంభించిన కావ్యమిది. ఈ ప్రథమభాగము పూర్తి కాగానే అందందు సభలలో విన్పించితిని. కొందఱు పండితులు చాలభాగములు చదివిరి కూడను. ఏకగ్రీవముగవారి ఆమోదము లభించుట నాకు సంతృప్తి నిచ్చినది. ఉచ్చారణ సౌలభ్యమునకై ద్రుతసంధి అటనట విడువబడినది. 'శ' 'స' లకు ప్రాసము వాడితిని, ఇందులకు పెద్దల ప్రయోగములున్నవి. ప్రామాదికములయిన దొసగు లేవయిన ఉండిన ఉండవచ్చును.

## అంకితము

నిరంతర రామనామ జపధ్యాన తత్పరుడైన హనుమంతుడు తన సర్వస్వము శ్రీరామచంద్రునకు అర్పించి చరితార్థుడైనాడు. హనుమంతుని చరిత్రయగు ఈ కావ్యమును గూడ సర్వలోక శరణ్యుడు భక్తజనమందారుడునగు శ్రీరామచంద్రుని చరణకమలముల యందు భక్తి వినమ్రుడనై సమర్పించుకొను చున్నాను.

## కృతజ్ఞత :

నేనడిగినంతనే ఈ కావ్యమునకు పీఠిక అభిప్రాయములు వ్రాసియిచ్చిన పండితులకు కవులకు, చక్కగా ముద్రించి యిచ్చిన ముద్రణశాలకు, ప్రత్యేకించి ఈ కావ్యముద్రణకు ధనసహాయము కూర్చిన శ్రీ ఆదూరి భీమారావు రైల్వే ఛీఫ్ ఇంజనీరు ( రిటైర్డు ) గారికి, నాకృతజ్ఞతలు తెలుపుచున్నాను.

ఇతఃపూర్వము నాగ్రంథములనాదరించినట్లుగనే ఈ నూతన కావ్యము శ్రీ హనుమత్ప్రబంధమును ఆంధ్రప్రజానీకము ఆదరించి శ్రీ హనుమత్కృపనందగలరని నా విశ్వాసము

గ్రంథకర్త

# ఆముఖము

ఆచార్య వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి M.A., Ph.D.
తెలుగు విభాగం ఆంధ్రవిశ్వకళాపరిషత్తు

ఆంధ్రసాహిత్య చరిత్రలో ఆధునికయుగము గద్యప్రాధాన్యమును బట్టి గద్యయుగముగా బరిగణింపదగినది. ఐనను రసవత్ప్రబంధ కవితా సౌందర్యాస్వాదన తత్పరులు కొరవడుచున్న ఈ కాలములో గూడ గవులు కొందరు హృద్యానవద్యముగ బద్యకావ్యరచనకు జీవితమంకిత మొనరించుకొనుట పరమాభినంద్యము. అట్టివారిలో వివిధ కావ్యరచనలచే లోక విశ్రుతినందిన వారు కవిశేఖర కొండేపూడి సుబ్బారావుగారు.

వాల్మీకి మహర్షి విరచితమయిన శ్రీ మద్రామాయణమున హనుమంత్పాత్ర అత్యంతప్రాథమ్యము నొందియున్నది. అనంతర మావిర్భవింపబడిన పెక్కుపురాణములందును ఆపాత్ర బహువిధ మాహాత్మ్యమును సంతరించు కొనినది.

పరాశరసంహితయందు సప్తమపటలమున "హనుమంతుడు పూజింపబడినచో సర్వదేవతలు పూజింపబడినట్లే" యనియు ఆతని మహిమను బ్రహ్మగూడ వర్ణింప జాలడనియు నిట్లుగ్గడింప బడినది.

ఆంజనేయః పూజితశ్చేత్పూజితా సర్వదేవతాః !
హనుమన్మహిమా శక్యో బ్రహ్మణా పిన వర్ణితుమ్ !!

ఉమాసంహితయందు మహావీరుడైన ఆంజనేయుడు బ్రహ్మవిష్ణు శివాత్మకుడని యిట్లు పేర్కొనబడినది.

ఆంజనేయం మహావరం బ్రహ్మ విష్ణు శివాత్మకమ్ !
బాలార్కసదృశాభాసం రామదూతం నమామ్యహమ్ !!

శౌన సంహిత యందు హనుమత్సేవాతత్పరులకు భోగ మోక్షములు రెండును కరతలామలకములని యిట్లు సూచింపబడినది.

యత్రాస్తి భోగో నహి తత్ర మోక్షః
యత్రాస్తి మోక్షో నహి తత్ర భోగః
ఔ మారుతేస్సేవన తత్పరాణాం
భోగశ్చమోక్షశ్చ కరస్థ ఏవ !!

అట్టి హనుమద్దివ్య చరిత్రమును కవిశేఖర శ్రీ కొండేపూడి సుబ్బారావు గారు సర్వకావ్య సామగ్రీసమంచితమైన మధుర కావ్యముగ సంతరింపబూనుట సర్వజన సమాదరణీయము.

తమ కావ్యమును గూర్చి కవిగారు వెల్లడించిన అభిప్రాయములు :

1. సమ్మాన్యంబగు సంప్రదాయ కవితా సంధాన మీ నవ్యక
వ్యమ్మేపారుత సాహితీ మధుర సర్వస్వ ప్రతిష్ఠాంకమై.

11. మధురార్థశబ్దముల నవ్యోద్యత్ ప్రబంధమ్ముగా ననుసంధించుచు,

శ్రీ సుబ్బారావుగారు హనుమద్దివ్య పదారవింద వరివస్యా లబ్ధ పరమానుభూ త్యా విష్కరణమే ఈ కావ్యరచనా ప్రయోజనమని యిట్లు తెలిపినారు.

మునుపీపావని గాథలెల్ల కవితా పుణ్యోదయుల్ వ్రాయలే
దని కాదీ రచనమ్ము నాహృదయమం దత్యంత సమ్మాన్యమై
హనుమద్దివ్య పదార్చనానుభవ హర్షాధిక్య సంపత్తి కా
రణమై వ్రాయగ జేసె నాకపివర ప్రజ్ఞా విశేషమ్ములన్.

సాధు శబ్ద కవితా స్వారస్య పద్యక్రమముగా హనుమయే ఈ కావ్యమును రచింపజేయుచున్నట్లు కవిగారిట్లు పేర్కొనినారు

అన్నామారుతి! నేనెవండను మహాత్మా! నిత్యసత్కార్యసం
పన్నంబైన భవచ్చరిత్ర లిఖియింపన్; నామనో వాంఛ లీ
సన్నాహంబులు సాధుశబ్ద కవితా స్వారస్య పద్య క్రమం
బెన్నన్ నీ పలికించు పల్కు లివిగావే పూర్ణవిద్యాకృతీ!

ఇందు గర్తృత్వము పరమేశ్వరార్పణమగుట హర్షింపదగ్గ విషయము

శ్రీ సుబ్బారావుగారు రచింపబూనిన హనుమచ్చరిత్రమున నిది తొలి సంపుటము. ఇందు అయిదాశ్వాసములు గలవు. అంజనాకేసరుల వివాహము, హనుమజ్జననము, హనుమద్విద్యాభ్యాసము, శ్రీరామదర్శనము రామసుగ్రీవ సఖ్యము వాలివధ సీతాన్వేషణము మున్నగు కథాంశములు ఈ సంపుటమున వర్ణింపబడెను. ఇంకనురెండు సంపుటములలో ఈ ప్రబంధము రచింపబడగలదు. ఇతివృత్త విస్తృతిని బట్టి హనుమచ్చరిత్రము పురాణప్రాయమనదగినది. కాని కవిగారు ప్రాచీనమహాకవుల ప్రబంధరచనా విన్యాస బంధురముగా దీనిని రచింప సంకల్పించుటచే ఈ కృతికి హనుమత్ప్రబంధమని నామకరణ మొనరించినారు.

ఆంజనేయ స్వామి తన సర్వస్వమును రామార్పణ మొనరించుటచే కవిగారీ కావ్యమును రామాంకిత మొనరించుట పరమౌచిత్య బంధురముగా నున్నది.

తన సర్వస్వము రామభువిభుని పాదద్వంద్వ సంసేవకై
వినియోగించిన ధన్యజన్ముడు జగద్విఖ్యాత చారిత్రుడా
హనుమం డాతని స్వామినే కుతుక మేపారన్ గ్రుతిస్వామిగా
వినుతుల్ జేసి యొసంగినాడ మృదు మాధ్వీరమ్య మీ కావ్యమున్

ఇందు గవిగారు తమకావ్యము మృదు మాధ్వీరమ్యముగా నున్నదని పేర్కొనుట గమనార్హము.

''వర్ణనా నిపుణః కవిః'' అని ఆలంకారికోక్తి, అనల్ప వర్ణనా ప్రచురముగా రచన గావించువాడు కవియని తాత్పర్యము. కావ్యరచనలో విదగ్ధులైన శ్రీకొండేపూడి వారు ఈ హనుమత్ప్రబంధమును ప్రభాస తీర్థ వర్ణనముతో ఆరంభించినారు. శబ్ద సౌందర్యము, అర్థగాంభీర్యము అహమహమికతో స్పర్థవహించినట్లు ఆవర్ణనము నిర్వహింపబడినది.

పన్నీటి వలిమించు మున్నీటి తుంపురుల్
చలువ వెన్నెలలతో జెలిమి సేయ,
రంగదుత్తుంగ తరంగో త్కర శ్రేణి
పర్వతాగ్రములతో బంతమాడ,
జలువంపు గ్రొన్నురువ్వు తెలివెల్గు చాయలు
నింగి నీలిమలను భంగపఱుప,
లోనున్న రత్నాంచి తానూన దీధితుల్
మార్తాండకాంతికి మారువలుక

అమలకాంచన కణ చూర్ణముల దెచ్చి
మేలి పడకల దీర్చిన లీలదనరు
లలితసుస్నిగ్ధ సైకత స్థలు లెసంగు
సర్వసౌందర్య మచ్చటి సాగరమ్ము.

ఈ కావ్యమందలి వర్ణన లన్నింట సూర్యోదయ వర్ణన మత్యంత ప్రశస్తముగా, పరమ ప్రౌఢ భావసమంచితముగ మంజుల పదబంధ బంధురముగ నిట్లు సాగినది.

పద్మ ప్రతానమ్ము భక్తిమై జేసిన
పరమనిష్ఠా తపః ఫలమనంగ,
క్షితిని గ్రమ్మిన కారు చీకటుల్ దొలగంగ
సురలు వెల్గించిన జ్యోతియనగ,
ప్రత్యుషస్స్నాతయై ప్రాగ్దిశా విమలాంగి
నొసలిపైనిడిన సిందూర మనగ,

భూమండలం బెల్ల పాలుపార బండించి
కూర్చిన బంగారు కుప్పయనగ,

భాను బింబమ్ము వచ్చె బూర్వాద్రిపైకి
దనకు దీటైన కాంతి వితాన మమర
నవల నెవ్వడౌ వెల్గుచున్నట్లు దలచి
యాంజనేయుని జూచుట కరుగుకరణి.

ప్రబంధోచిత కల్పనలతో రచింపబడిన యీపద్యము తిక్కనగారి ''నీరజాకరములు నిష్ఠమైజేసిన'' అను పద్యమును దలపించుచున్నది.

లంకకేగుటకు గపులు దర్శించిన మహోదధివర్ణనముగూడ కవిగారియనుపమ వర్ణనా నైపుణ్య సమర్థకముగా నున్నది.

1. కనిరావానరవీరులెట్టెదుట ............

2. ఝుంఝూ ప్రభంజన చండ వేగోద్ధూత
భంగోత్కరంబు లంబరము ముట్ట........

3. ఈ సముద్రమ్మటే ......................మున్నగునవి.

ఇందలి సమాసబంధురమ్మైనపదబంధములు ఆవారాశి యౌద్ధత్యమును గాంభీర్యమును సూచించుటకు దగియున్నవి.

ఆంజనేయస్వామి సూర్యునొద్దసమస్త విద్యలు నేర్చి గురుదక్షిణగా ఆతని కోరికపై ఆతని పుత్రుడైన సుగ్రీవునకు మంత్రిగా జేరి కొలుచుట కవిగారి కల్పనము సమన్వయము సుమనోమనో హారముగా నున్నది.

పంచమాశ్వాసమున శ్రీరామావతారగాథ విపులముగా నభివర్ణింపబడినది. అది కవిగారికి రామకథపైగల భక్తిప్రాభవమును నిరూపించుచున్నది. కృతిపతియైన రామచంద్రునకు అవధరింపుమని కవిగారు ఆతని చరిత్రమునే నివేదించుట ఒక విశేషము. జగజ్జ్యోతియైన సూర్యభగవానునకు ''దీపం దర్శయామి'' అనునట్లున్నది.

లోకకంటకుడు స్వర్లోకధూమకేతువుగా విజృంభించుచున్న రావణుని దుశ్చేష్టలను పరమ రమణీయముగా గవిగారిట్లు చిత్రించినారు.

జనులకు నిద్రరాదు, సుఖశాంతులు లేవిలపైని, స్త్రీలకున్
గనబడ దాత్మరక్ష, సవనాగ్నులు వెల్గవు, స్వర్గహీనులై
చని రనిమేషు లావలకు, సర్వజగమ్ములు కంపమొందు నా
దనుజుని నామమాత్రమున ధైర్యము దక్కిశిరమ్ము వాల్చుచున్

ఆంజనేయుడు రామలక్ష్మణులకు సుగ్రీవుని బరిచయ మొనరించుటలో సుగ్రీవపాత్ర స్వరూపస్వభావములు సంగ్రహముగా సూత్రప్రాయముగ నివేదింపబడినవి.

ఆ సుగ్రీవుడు సర్వధర్మ నియమాభ్యాసుండు, దోర్దర్పరే
ఖా సర్వస్వుడు, స్నేహపాత్రుడు, దత దర్ప స్వామి పుత్రుం డెదన్
మీ సఖ్యమ్మును గోరి నన్నిటకు బంపెన్ మిమ్ముదోడ్తేర; వి
శ్వాసార్థుం డెదియేని మేలు నొనరింపన్ శక్తిమంతుండగున్.

భావికథార్థ భోధకముగా సుగ్రీవుని గుణములిందు వర్ణింపబడుట విశేషము. శ్రీ కొండేపూడివారి పాత్రచిత్రణ సామర్థ్య నిరూపకముగా ఈ వర్ణనము నిర్వహింపబడినది

హనుమంతునకు రామలక్ష్మణుల ప్రథమ దర్శనము, శ్రీరాముని అంగుళీయకమును తీసికొనిపోవునపుడు హనుమని భావములు కల ఘట్టములు అత్యంత రమణీయములు.

సురుచిరశృంగార రసపోషణమున కవిగారి యనుపమ ప్రజ్ఞ అంజనాకేసరుల యద్వితీయ దాంపత్య సుఖానుభవ వర్ణనమున యభివ్యక్త మగుచున్నది. మధురోదాత్త గంభీరముగ ఆప్రణయమిట్లు వర్ణింపబడినది.

మధుమాస తరుకదంబముల నంజన చూపు
నతడామె నచట నుయ్యాలూపు,
సుమనికుంజముల కారమణి సేవలొనర్చు
నతడామె కొఱకు మాల్యముల గూర్చు,

.....................................

శ్రీ కొండేపూడి సుబ్బారావుగారి అలంకార ప్రయోగ సామర్థ్యమునకు ఈ పద్యము ప్రబలోదాహరణముగా గలదు

గ్రీష్మతప్తమై వాడిన వృక్షరాజి
కంబుధారలు గురిసిన యట్టులయ్యె,
ఆశలుడిగిన కపి హృదయమ్ములకును
ధైర్యమొసగు సంపాతి వాగ్ధారలచట.

హృదయంగమములైన కొన్ని భావచమత్కృతులీ కావ్యమున గుణోత్కర్షకములై ప్రయోగింపబడినవి. ఇట్టివెన్నోయున్నవి.

1. రుమనుగూర్చి : భావజుబాణమో యనగ భాసిలుతన్వి
2. కామాసక్తుడైన సుగ్రీవుని మందలించుటకు వెడలిన లక్ష్మణుని గూర్చి : కుపితోగ్ర తీవ్రకీలానల నిర్నిరీక్ష్య విలయాకృతి...

ఈ కావ్యమున జిగీష, ప్రక్షిమవంటి ప్రౌఢ పదములు ప్రయోగింపబడుటయేగాక సుదీర్ఘసమాసములు గూడ సహజ సుందరముగ గ్రథనకౌశలముగ బ్రయోగింపబడినవి.

1. స్ఫారోదార వసంత పుష్ప విగళత్ సౌరభ్య పారంపరీ పారమ్య ప్రవిలాసభాసురము
2. వర్షామేఘ వినీల సుందర తనూ భాస్వన్మహాతేజము
3. చాంపేయాగరు మల్లికాది సుమనస్సౌరభ్యవీచీ స్ఫురత్సంపన్నమ్ము
4. జగతీ కల్యాణసౌందర్య రేఖానూనామల దివ్య విగ్రహ సమగ్రశ్రీ మహోమూర్తి

ఛందస్సునకు సంబంధించిన వివిధ వృత్త ప్రదర్శనలో గవిగారు చూపిన ప్రజ్ఞ అనన్యసామాన్యము. ఉత్పల మాలికలు ప్రదర్శింపబడినవి. మత్తకోకిల మానిని వంటివి ప్రయోగింపబడినవి. సాహిత్యమున నెక్కడోగాని కనుపింపని ప్రహర్షిణి ప్రమాణి, విజయ మంగళము, మణిరంగము వంటి విశేషవృత్తములిందు నిర్వహింపబడుట విశేషము. అవియును సందర్భసముచితముగ గూర్చబడుట వృత్తౌచిత్యపోషణమున గవిగారి ఆసక్తిని నిరూపించుచున్నది.

ఇట్లే ''వెదుకబోయిన తీవియ యెదురగుచుంగాళ్ల దగిలి యింపు దలిర్పన్'' వంటి పలుకు బడులు గూడ ఈ కావ్యమున పోషింపబడినవి.

జీవితమున ఇంచుమించు ఎనుబది సంవత్సరముల యనుభవము గల్గిన వారగుటచే శ్రీ సుబ్బారావుగారు అక్కడక్కడ లోకపు తీరుతెన్నులను సూచించినారు. ఆవాక్యములు బంగారమున రత్నములను బొదిగినట్లు కావ్య సౌందర్యమునిను మడింపజేయుచు జీవితమార్గోపదేశికములై పాఠకలోకము నుత్తమ సంస్కార సంపన్న మొనర్పగలవు.

1. ఏగవు దినములు జగతి నొకేగతి...
2. దైవమెం తానొనరించు ప్రేమసంధానము లుర్వి బిడ్డలకు తల్లుల కీయనురాగబంధముల్
3. అవనితలమున నెంతవాడైన గూడ గర్మఫలమీగ జాలినఘనుడులేడు

ఈ విధముగ హనుమచ్చరిత్రము ధారాశుద్ధిగలిగిన రసవత్ప్రబంధముగా, మధుర గంభీర శైలితో విద్వల్లోక ప్రశంసాపాత్రముగ రచింపబడుట అభినందనీయము. సహృదయ పాఠకులు చదివి తరింతురుగాక. కవిశేఖర శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు ప్రతిపదసార్థకముగ, మధురార్థ బంధురముగ, అనల్పకల్పనావైభవముతో మిగిలిన భాగములను గూడ అచ్చువేయించి సంపూర్ణ హనుమత్ప్రబంధమును అచిరకాలముననే అందింతురుగాక!

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి యేషాం యశః కాయే జరామరణజం భయమ్
శుభం భూయాత్

విశాఖపట్నం
15-4-96



**కీర్తిశేషులు శ్రీ ఆదూరి విశ్వనాథము : కనకదుర్గాంబ పుణ్యదంపతులు**

| | | |
|---|---|---|
| జననము 1908 | : | 1912 |
| నిర్యాణము అగస్టు 1995 | : | అక్టోబరు 1975 |

★★★★★

వారి కుమారుడు **శ్రీ ఆదూరి భీమారావుగారు** రైల్వే ఛీఫ్ ఇంజనీరు, C.A.O. (రిటైర్డు)
జననీజనకుల సంస్మరణ పూజా చిహ్నముగా
ఈ **హనుమత్ప్రబంధ** కావ్యమును ముద్రింపించిరి.

## ఆశీస్సు

జ్యోతిశ్శాస్త్రవిశారదుండు, సుగుణస్తోముండు, సత్కార్యదీ
క్షాతాత్పర్యుడు, దైవచింతన సదాచారుండు, వాక్చాతురీ
ఖ్యాతిం గల్గిన దేశికోత్తముడు శ్రీ ఆదూరివంశాంబుధిన్
శీతాంశుండగు విశ్వనాథ మలరెన్ జేగీయచారిత్రుడై.

వాసిగ పల్లెటూరిబడిపంతులుగా నిజజీవితమ్మునన్
జేసినవృత్తి చిన్నదియె చెప్పుకొనన్; తన సత్ప్రవర్తనా
భ్యాసముచేత గొన్న మరియాదయు,మంచియు పెద్దవై యశ
శ్శ్రీసముపేతుడైన గుణసింధు వతండు సమర్థుడన్నిటన్.

ఆయనకున్ సతీమణి నిరంతరభాగవతప్రబంధపా
రాయణపుణ్యశీల, మృదులామలభాషిణి, దుర్గమాంబ, ప్రే
మాయతసాధువర్తనల నందరిమధ్యను పేరుగొన్న సు
శ్రీయుతమూర్తి; ధర్మగుణచిత్తు లుదారులు వారలిర్వురున్.

పెద్దలుసేయు పున్నెముల పెంపువహించుచు వారియన్వయం
బొద్దికతో సదాశయసమున్నతమై విలసిల్లు; సర్వతో
వృద్ధిగ విద్యలందున, వివేకమునందున, శీలమందు, నా
పెద్దల యాశిషమ్ములె భువిన్ దయజూచుత వారినెప్పుడున్.

ప్రణుతాత్ముల్ తనతల్లిదండ్రులగు దుర్గావిశ్వనాథద్వయిన్
మనమం దెంచుచు తత్కుమారమణి భీమారావు సద్భక్తి నీ
హనుమత్కావ్యము వారిసంస్మృతికి చిహ్నంబై విరాజిల్ల ము
ద్రణ గావించె నతండువర్ధిలుత నిత్య మ్మాహనూమత్కృపన్.

గ్రంథకర్త

# శ్రీ హనుమత్ప్రబంధము

## ప్రథమభాగము విషయ సూచిక

# ప్రార్థన

## శ్రీరాముడు

2. రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే!
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయేనమః!!
ఆపదామపహర్తారం దాతారం సర్వసమ్పదామ్
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్!!

## హనుమంతుడు

3. అంజనానందనం వీరం జానకీశోక నాశనమ్!
కపీశమక్ష హన్తారం వందేలంకాభయంకరమ్!!

గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసమ్
రామాయణ మహామాలా రత్నం వందే నిలాత్మజమ్

మనోజవం మారుత తుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసానమామి

ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రి కమనీయ విగ్రహమ్
పారిజాత తరుమూల వాసినం భావయామి పవమాన నందనమ్

## విఘ్నేశ్వరుడు

1. శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్!
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే!!

## సరస్వతి

4. సరస్వతి! నమస్తుభ్యం వరదేకామరూపిణీ!
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా!!

శ్రీ రస్తు

శ్రీరామాయనమః

# శ్రీ హనుమత్ప్రబంధము

ప్రథమ భాగము

అవతారిక

ఇష్టదేవతా ప్రార్థన

హనుమత్స్తుతి

శ్రీ రామప్రభు దివ్యపాదయుగ రాజీవార్చనానందరే
ఖారోచిష్ణు, డజేయవిక్రమ మహోగ్రస్థైర్యుడున్ సాధుగా
థారమ్యుండు ప్రసన్నరూపు డఖిలత్రయ్యర్థ విద్యావిదుం
డారాధ్యుండగు నంజనాతనయు డత్యంతమ్ము నన్బ్రోచుతన్.

విఘ్నేశ్వరస్తుతి.

విలసితసత్కృపాన్వితుడు విఘ్నములన్ దొలగించుదైవ ము
జ్జ్వల శశివర్ణసుందరుడు భక్తులొసంగెడి పూజనాదులం
దొలుతగ గూర్మి గైకొను చతుర్భుజు డార్యకు ముద్దుబిడ్డడై
యలరిన గుజ్జువేలుపు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికై.

త్రిమూర్తిస్తుతి.

చెలువొప్పన్ బదునాల్గులోకములు సృష్టింజేసి పోషించి త
ద్విలయావృత్తి పునఃపునఃక్రమము దీపింపంగ జేయున్ సమ
ర్థులు బ్రహ్మాచ్యుతఫాలనేత్రులు త్రిమూర్తుల్ వారి కారుణ్యసం
కలితప్రాభవ సంపదున్నతులకై గావింతు సంస్తోత్రముల్.

వాణీ లక్ష్మీ పార్వతీస్తుతి.

నిరతోద్యత్కరుణావిలాసవిభవోన్నిద్రైక వీక్షావిని
ర్భర వాత్సల్యము జూపి భక్తులకు విద్యద్భాగ్యదీవ్యత్శుభో
త్కరముల్ గల్గగ జేయు ప్రేమభరితాత్మల్ భారతీశ్రీశివల్
సరవిన్ నన్గృపజూచుతన్ మధురవాత్సల్యానురాగమ్ములన్.

## దేవీస్తుతి

శంకాసంకులమైన నాహృదికి రక్షాభద్రము ద్రాంకిత
మ్మోంకారస్వరమాధురీ మహితనాదోపాస నామోదిత
హ్రీంకార ప్రథితాక్షరాక్షరకళాహేవాక మంత్రాన్విత
క్లీంకారోజ్జ్వల రూపమై వెలుగు నిన్గీర్తింతు కామేశ్వరీ.

## సరస్వతీస్తుతి.

శిరమునదాల్చిన చిన్నిజాబిల్లిచే తనమేనితెలివెల్గు లినుమడింప,
రత్నకిరీటోరురమణీయకాంతులు గగనాగ్రసీమల కెగసివెలుగ,
వీణామధురగాన విమలసాహిత్యముల్ వేదోక్తిసుధల దిగ్వీధినింప,
నిజరూపసౌందర్య నిస్తులోజ్జ్వలకాంతి నలువనెమ్మోముపై నాట్యమాడ,

కోటిమంత్రపరంపరల్ కొలుచుచుండ
ప్రణవపీఠిక కొలువుండు వాగ్వధూటి
మహితచింతామణీమంత్ర మాన్యమూర్తి
వాణి వసియించుగాత నాస్వాంతమందు.

## సర్వదేవతాస్తుతి.

పావను లష్టదిక్పతు లపారకృపాభరితాత్ము; లన్యులౌ
దేవత లెల్ల రర్మిలిని దీవనలిచ్చి మరందమాధురీ
శ్రీవిభవప్రసిద్ధిగ రచింపగనెంచిన యీప్రబంధ మీ
పావనిసత్కథన్, విజయవంతమొనర్చి యనుగ్రహించుతన్.

## శ్రీవేంకటేశ్వరస్తుతి.

పరమదయార్ద్రమూర్తి, ప్రియబాంధవు డాశ్రితభక్తపాళికిన్,
కరమనురక్తి నాకృతులకన్నిటి కాశ్రయమైన స్వామియున్,
కరుణదలిర్ప ఈకలియుగవ్యథలన్ దొలగించు దైవమై
తిరుపతికొండపై గొలువుదీరిన దేవునకున్ నమస్కృతుల్.

### గురుస్తుతి.

వీణాపాణి సరస్వతిం దలచి సంప్రీతిన్ నమోస్తంచు నే
''నోనామా''లను నేర్పుటే మొదలు నన్నుం బ్రేమతో జూచి వి
ద్యానందం బిడినట్టి సద్గురువులన్ ధ్యానంబునన్ నిల్పి స
మ్మానింతున్ గృతి కాశిషమ్ములిడి సంపత్కీర్తి గల్పింపగా.

### జననీ జనకుల సంస్తుతి.

జన్మంబిచ్చినదే మొదల్ మధురవాత్సల్యంబుతో సాకి ప్రే
మోన్మేషం బలరార పెంచిన మహాత్ముల్ దైవ రూపమ్ము ల
స్మన్మాతాపితలైన రత్నమను, శ్రీసర్రాజునున్ నెమ్మదిన్
సన్మానించి ఘటింతు భక్తి వినయ శ్రద్ధాంజలుల్ నిత్యమున్. 10

### సత్కవిప్రశంస.

మానితరీతి నధ్యయనమార్గమనోజ్ఞ విశిష్ట బోధనల్
కానని మానసమ్మునకు కావ్యకళల్ చవిజూపగా గురు
స్థానములైన పూర్వకవిచంద్రులు నన్నయ తిక్కనాది భా
షానిధు లేర్పరించిన ప్రసన్న కథావిధు లాశ్రయించెదన్.

### రసజ్ఞ శేఖరులు.

సరసత జూచి, లక్షణపు జందములన్ గని, కావ్యతత్త్వ పుం
దెరువులెఱింగి, భావరమణీయత గాంచి, పదప్రయోగవి
స్ఫురణ గ్రహించి కావ్యగుణముల్ గురుతించి నుతింపగల్గు ధీ
వరులు లభించినన్ కవుల పాలిటి భాగ్యము, కావ్య సిద్ధియున్.

### సంప్రదాయకవిత

పరువమెలర్చు సాధుపదబంధములై, మధురార్థ సారసం
భరితముగా కవిత్వపరమార్థము జూపిన సంప్రదాయమును
దరమగు తెన్గుకైతల విధమ్ము గ్రహింపక క్రొత్త తెన్నులన్
బరువిడు వ్రాతలీ తెనుగు బాసకు శ్రేయముగాని రీతులౌ.

వెదుకంబోయిన తీవియ
యెదురగుచుం గాళ్ళదగిలె నింపుదలిర్పం
గుదుటంబడియెను కుంజరు
మది చింతితకార్యసిద్ధి మానుగ గన్నై,

దవ్వుల నవ్వల నివ్వల
నవ్వనములు నుందరమయి నివ్వటిలెన్
పువ్వుల ప్రోవులు నవ్విన
నవ్వులుగా నవ్యకునుమ నందన వనులై.

చందన శీతలమ్ములు వసంతవనాంత లతావితానముల్
పందిరులయ్యె, తోరణములన్ రమణించిన వాపరీమళత్
సుందరపుష్పముల్; విపినశోభసమస్తము వచ్చి అంజనా
సుందరికిన్ వివాహశుభశోభనమందిర మై నయట్లుగా.

కోసిన పండ్ల గుత్తులను కోసినయట్లుగ వానరోత్తముల్
రాసులు దెచ్చిపోసిరి విరాజిత నూతన వన్య మాధురుల్,
చేసిన చేతలన్ విసువుచెందని రీతుల కొండకోనలన్
క్రోసులదూరముల్ వెదకికొంచును తెచ్చిరి పుట్టతేనియల్.

వంతులుగ పెండ్లివిందున
గంతులిడుచు కపులును తమకడుపులు నిండన్
సుంతయు వలదనుదనుకన్
పంతమ్ములు వోయి తినిరి ఫలములు తేనెల్ -

రసాలి.

ఆమె సుందరియు నాతడుద్యత్
స్థేమ భాసురుడు శిక్షితారి
సోము డిర్వురును శోభితార్ద్ర
ప్రేమ వర్తనులు శ్రీసమేతుల్ -

దీపిత దైవనిర్ణయ విధిప్రథమానము, లోక సత్తపః
ప్రాపిత భాగ్యమౌ పరిణయమ్మిది, అంజనగర్భశుక్తిము
క్తాపటు కీర్తి కౌముదు లికన్ దిశలన్ ప్రసరించుచున్ త్రిలో
కీ పరమార్థముల్ సుజన కీర్తన లౌనని పల్కిరార్యులున్. 140

ఆశ్వాసాంతము

కేసరి అంజన లుదిత
శ్రీసముదీర్ణగుణు లిర్వురి వివాహమ్మున్
వ్రాసితి నీకున్ రసవత్
భాసుర పద్యార్పణమయి వరలుత రామా!

ప్రణవబిందు చిదాత్మ సంప్రభవ నాద
విగళితానంద రసమయ విగ్రహుడవు,
పరమ శాంతి సంధాతవు హరివి నీవు
అవనిజా హృదయాబ్జపీఠాభి రామ!

అమర వంద్య మాన మృదుపదాంబుజుడవు
వేద తత్త్వరహస్యకోవిదుడ వీవు
భక్తలోక రక్షాప్రౌఢ భవ్యమతివి,
సుజన మునిజన క్షీరాబ్ధి సోమ ! రామ!

ఇదియేదో నిరతము నీ
పదపంకజమధుప మయిన పావని చరితం
బెద గదలించిన పుణ్యా
స్పద కథయయి నిను దలచుచు వ్రాసితిరామా !

ఇది పశ్చిమ సముద్రతీర విలసిత ప్రభాస తీర్థ వర్ణనము, శబల శంఖము లను క్రూర మత్తేభములను వానర వీరుడు కేసరి చంపుట, కేసరి అంజనల వివాహ కథయు గల శ్రీ శ్రీహనుమత్ప్రబంధ ప్రథమాశ్వాసము. 145

# శ్రీ హనుమత్ప్రబంధము

ద్వితీయాశ్వాసము

శ్రీ మన్మారుతి పూజిత
కోమల చరణాభిరామ! కోదండబలో
ద్దామా ! జననుత సద్గుణ
ధామా! నరవర లలామ! దశరథరామా

దేవా ! అవధరింపుము

కేసరి అంజనల దాంపత్యము.

తరుణీమణి అంజనయును
వరగుణు డా కేసరియును భవ్యచరిత్రుల్
సురుచిరసుందరజీవన
భరితామోదములు వారి ప్రణయక్రీడల్.

ఆ శృంగారము లాసుఖానుభవ మర్యాదల్ ప్రియంభావుకా
వేశోద్భాసిత భోగలాలిత కళాన్వీతమ్ము లాకామలీ
లాశాస్త్రాభ్యసన ప్రచోదిత మహోల్లాసమ్ములున్ ప్రేమసం
దేశమ్మందున నూత్నపాఠములు పృథ్విన్ కాముకశ్రేణికిన్.

చిలుకయుగోరింకయు బలె
విలసిత నవ్యానురాగ విహితక్రీడా
కలితోత్సుక విహరణముల
కలసియె యేగుదురు వారు కానలవెంటన్.

మధుమాసతరుకదంబముల నంజనచూపునత డామె నచట నుయ్యాలలూపు, సుమనికుంజముల కారమణి సేవలొనర్చు అత డామెకొరకు మాల్యముల గూర్చు, ఫలతరుచ్ఛాయ కాపొలతి సేదకుజేరు అరమ్రుగ్గిన పండ్ల నాతడేరు, అంబుధితటి కతం డంజనన్ గొనివచ్చు అచటి శీతానిల మ్మామె మెచ్చు,

ఆమ్రతరువుల మాలతు లల్లుకొనుచు
పెరుగు గుబురులదరికి కేసరియు నరుగు,
ప్రణయపులకితదేహా అంజనయు జేరి
లలితలలితమ్ము లతనికౌగిళుల నొదుగు.

అతిచిత్రం బద్భుతమయి
మతిజొప్పడు నావనచరమహిమము లరయన్
క్షితిపయి మానవులట్లే
బ్రతుకుదురు వారు నిజముగ స్వర్వాసనముల్.

ఏగవు దినములు జగతి నొ
కేగతి; నొడుదుడుకులవెత లెవ్వరికేనిన్
వేగము యరుదెంచు తొలగు;
సాగిన వంజనదినములు సయిత మ్మిట్లే.

కేసరివైరాగ్యము

అమలమనస్కు లాయిరువు రట్లనురాగ మెసంగ కాలమున్
సుమధురమూర్తులై గడపుచుండగ కేసరి కేమిహేతువో
క్రమముగ చిత్తమందొక విరాగము కల్గినమాట నంజనా
రమణి గ్రహించియున్ దలపురాపిడికిన్ మనసొగ్గ దింతయున్.

తెలియగనీయ దాయమ మదిం గలగించుచునున్న వంతయున్,
దెలియగనీ డతండు తన తీవ్రమనోగత వాంఛనేమియున్;
తలపులు కొన్నినాళ్ళిటుల దాచిన కేసరి యెట్టకేలకున్
బలుకదొడంగె నంజనయు బాష్పజలాకుల నేత్రయై వినన్.

వనితా నీవు గ్రహించి యుందువనియే భావించుచుంటిం దపో
మనన ధ్యాన జపవ్రతాది విధులన్ మగ్నంబు నామానసం
బనివార్యంబుగ, ఈప్రయత్న మఖిల మ్మాదైవనిర్ణీతమౌ
పనిగా దోచునుగాన వేఱుగ దలంపంబోకు ముద్విగ్నవై.

విను మా నాడు మదద్విపమ్ములవి నావిక్రాంతికిన్ లోగియా
ల్గిన వేళన్ ననుజూచి వీరుడు జగద్గేయుం, డజేయుండు, నం
దనుడౌ నీకని జెప్పె నామునిభరద్వాజుండు తద్వాక్యమం
దనుమాన మ్మిక లేదు నీకిదియు తన్వంగీ శుభోదర్కమౌ.

నీమాతృత్వము విష్ణునామ మహిమోన్నిద్ర ప్రభావోదయ
శ్రీమాహాత్మ్యము, సర్వరాక్షసచమూ శీర్షచ్ఛిదాదక్షమౌ
సామర్థ్యమ్మును, వేదశాస్త్రవిలసత్ సౌజన్య సాహిత్యశో
భామాధుర్యధుర మ్మటంచు మునియున్ వాక్రుచ్చెనో భామినీ.

వినమత్శీర్షములై గిరుల్సయిత మేవేల్పున్ తమిన్ గొల్చు నా
వినుతప్రాభవ వేగ దుస్సహబల స్ఫీతోగ్రుడౌ వాయుదే
వుని ప్రార్థింపుము, దిక్పతిత్వధిషణాపూర్ణుండు దీవ్యద్యశో
ధను డాదేవు డనుగ్రహించును భవద్వాంఛామహాలాభమున్.

కను మాప్రాగ్దిశ కాంచనారుణ కనత్కాంతిచ్ఛటల్ నిండెడున్
నను బోనిమ్మిక నంచు మౌనిజనమాన్యంబైన దీక్షాకృతిం
జనె నాకేసరి అంజనన్ విడచి; యీసంసారసాంగత్యబం
ధనముల్ కోసి చరించువారల చరిత్రల్ చూడ అట్లే యగున్. 10

అకలుషు డాత్మనాథుడు జటాజినముల్ ధరియించి యేగగా
ఒకనిముసమ్ము ఖేదము మఱొక్కనిమేషము చిత్తమం దెదో
ప్రకటతరానుమోదమధుర మ్మగు ఆశ జనించి నట్లు వె
న్కకు అలనల్లనన్ జనె మనమ్మను అంజన చిక్కబట్టుచున్.

మధ్యాక్కఱ

ఒకసారి ఒకమబ్బు వచ్చి ఉడురాజుపై గ్రమ్మినటుల
ఒకసారి ఒకమబ్బు విచ్చి ఉడురాజు కన్పించినటుల
ప్రకటిత నైరాశ్యమందు ప్రకటిత నవ్యాశయందు
వికల మంజనకు మనస్సు; వికసిత మ్మంజన మనస్సు.

మధ్యాక్కఱ

పతియేగె తనదారి, నీకు పవనుడె ప్రాణేశు డనుచు
పతియానె, కనులకన్పడనివా డొకపవనుం డ దెట్లు
పతియేమొగాని నాగతియు పండిన దీరీతి ననుచు
మతియుండి లేనట్లు మాటిమాటి కంజనడెంద మడలు.

మధ్యాక్కఱ

మునుకొని మనసెల్ల నిండు మొదటిదుఃఖపు పొం గొకింత
అణగారి తనకేదొ యాశ అగుపించి మరపించి నంత
పెనగొన్న మేఘముల్ విడిన వెలివెన్నెలల చల్వ లనగ
తనువునన్ మెదలె నంజనకు తరలి వచ్చిన గాలితరగ.

అంజనావాయుదేవుల కలయిక

మధుమతి

నవవికాసముతో గవియు చంద్రికలై
తవిలె నంజనకుం జవులు గ్రొత్తవియై.

ఒకమునిసత్తముం డనియెనో తనభర్తయె యూహసేసెనో
సకలము భ్రాంతిగా నెడద సందున తోచియు తోచనట్టి భా
వుకగతి నున్న యంజనకు పొల్పుగ నేడు సమీరుడే మనో
వికలత మాన్పి యేలుకొను వేలుపుగా గనుపించె నెమ్మదిన్.

ఆరేయంతయు అంజనాసతికి నేత్రాంతమ్ములం దేదియో
పారావార గభీరనీర తరణ ప్రావీణ్య రేఖోల్లసత్
ధీరమ్యంబగు తేజమొక్కటి వియద్వీధీచలత్క్రీడగా
నై రాజిల్లెను పుత్రమోహకలితాహ్లాదమ్ము లూరించుచున్.

కలయని తెలియని స్థితిలో
ఉలికిపడిన దంజన యెవరో దూరముగా
సలలిత మృదు నిస్వనముల
పిలిచిన య ట్లానిశీథవేళన్ బ్రీతిన్.

కలగిన గుండెలోతుల నొకానొకధైర్యము నూని క్రొందలం
పుల నునుతీపివెల్లులు గుబుల్కొను మోమలరార ఇంటిలో
వెలువడివచ్చె నంజన నవీన మనఃప్రమదప్రలోభనం
కులమతి త్రోపువెట్ట తొలికోడియు కూయని రాత్రివేళలో.

వలిమంచుంజడి తళ్కులొత్తిన వనీప్రాంతమ్ము దీప్తమ్ముగా
చలువల్జిమ్ముచు, జాలుజాలులుగ జ్యోత్స్నాకారి శైత్యాంశువుల్
తెలిపాన్పుల్ సవరించె క్రొంజిలుగుపూదీవల్ నవోన్మేషముల్
తొలిప్రొద్దున్ నునుగాలి వీవనలకై తూగాడె నొక్కొక్కటే.

చదలపై నడయాడు జలదమ్ముభంగి
పెదవిపై కదలాడు మృదుహాస మట్లు
పూలతీవియమీది పూగుత్తి వోలె
గాలితాకిడులలో కదలె నంజనయు.

పాయలుపాయలై పరువువారుచు బోవు సరస్వతీనదీ
తోయతరంగ సంతతుల తుంపురు లాచలివెల్లు టందపుం
జాయల తళ్కుటద్దపుబసల్ మిసలాడిన జాడలందు జా
ల్వోయదొడంగె దూరపు పులుం గొక నూతనరాగమాధురిన్.

పూవుల్పూచిన యావెలుంగుచెలువమ్ముల్ చిందు క్రొందోవలం
దావర్చస్విని అంజనాసతియు తీయన్మైత్రి ఆశాలతల్
త్రోవల్చూప సరస్వతీనదికి దారుల్ పోల్చుకొం చేగి యా
గ్రేవన్ వన్యమనోజ్ఞశోభ లనురక్తిన్ జూచుచున్నంతలో.

వైతాళీయము:

మలగిమలగి మంజులాటవిన్
నిలుచుచునిలుచు చనేకవాటులన్
కలగికలగి కాంతయందమున్
తలచుచుతలచుచు తాల్మి తూలగన్.

ప్రాచీసుందర పర్వతాగ్ర హిమవత్ ప్రాగ్భారశైతల్యమై
పూచీపూయని మొగ్గకన్నియల తావుల్ నూత్నసమ్మోదమై
వీచెన్ వాయువు మందమందగమనోద్వేలస్ఫురద్రోచియై
దోచెన్ దత్తరుణీ తనూవిభవ విద్యుత్కాంతిసౌందర్యముల్.

మధుమాసోత్సవ విభవా
స్పద లతికా సుమసుగంధ బంధుర వీచీ
మృదుపవనుడు తనువెల్లన్
గదిసి పొదువ అంజనయును కడువిహ్వలయై.

ఏకాంతమ్మున నున్న నన్నుగని యిట్లెవ్వండో నిర్భీకుడై
పైకొన్నాడని విస్మయంపడుచు విభ్రాంతాత్మయై నిల్వగా
నాకాంతాకరమున్ గ్రహించి పవనుం డత్యంత సౌందర్యశో
భాకారుండయి నిల్చి పల్కెను సుధావాక్పూరపూరమ్ములన్.

నీకళ్యాణతనూవిలాససుషమన్ వీక్షించి కాంక్షించి యే
నీకైవచ్చిన వాయుదేవుడను తన్వీ నాపరిష్వంగముల్
స్వీకార మ్మొనరింపు మిద్ది పరమశ్రేయమ్ము నీకీర్తికీ
లోకమ్మందునరాదు లేశమయినన్ లోపమ్ము సాధ్వీమణీ !

అలనాడెప్పుడో మోహితుండగుచు ఫాలాక్షుండు శ్రీమోహినిన్
దిలకింపన్ చలితమ్ముగా పడిన తద్వీర్యం బవార్యస్ఫుర
ద్బలతేజోవికస న్మహామహిమ సంభావ్యంబు నాయందునన్
గల దద్దాన జనించు నీకు సుతు డొక్కం డీశు తేజంబునన్.

కారణజన్ముడున్ దివిజకార్యధురంధరు డాగమాంతవి
ద్యారమణీయమూర్తి కమలాసనతుల్యుడు సాధుభావనో
దారు డజేయ విక్రమ విదారిత శాత్రవు డచ్ఛకీర్తివి
స్తారుడు విష్ణుభక్తిగుణధన్యుడునౌ సుతుడబ్బు నీకికన్. 30

నీమాతృత్వము విష్ణునామమహిమాన్విత ప్రభావోదయ
శ్రీమాహాత్మ్యము సర్వరాక్షసచమూ శీర్షచ్ఛిదాదక్షమౌ
సామర్థ్యమ్మును సాధువాదవిలసత్ సౌజన్య సాహిత్య శో
భామాధుర్యధురమ్మునై త్రిభువనప్రఖ్యాతమౌ నంజనా!

అనిలుం డట్లనిపల్క నంజనకు చిత్తాంభోజ ముత్ఫుల్లమై
తనయాత్మేశ్వరు డన్నమాటలు భరద్వాజర్షి వాకౌన్నదీ
వనలున్ నెమ్మదిలో ప్రతిధ్వనిత భాస్వన్మాధురుల్ చిందగా
ననిలున్ పాదములంటి భక్తినిరతిన్ ప్రార్థించె బద్ధాంజలిన్.

దండకము

శ్రీమన్మహావాయుదేవా దయార్ద్రస్వభావా, ప్రచండ ప్రభావా,
త్రినేత్రోరుతేజస్సమానోర్జితప్రాభవా, భక్తలోకార్చి తానూనసేవా,
త్రిలోకస్థలీవ్యాప్తమూర్తీ, శరత్కౌముదీ స్వచ్ఛకీర్తీశ్వరా
సర్వసర్వంసహాప్రాణిదేహమ్ములన్ ప్రాణమై రమ్యవాసంతపుష్పాసవామో
దమాధుర్యధుర్యుండవై, అష్ట దిక్పాలకశ్రేణి నత్యంతముఖ్యుండవై,
సాధుసమ్మాన్య సత్పుణ్య గణ్యుండవై, భోగివై త్యాగివై వేగివై పాలితానంత
దిగ్భాగివై సాధుమార్గానుసారుండవౌ నీవె నాకున్ శరణ్యమ్ము, సర్వాశ్ర
యమ్మర్చనీయుండ వయ్యా! భవత్పాద పంకేరుహధ్యాన తాత్పర్య
చింతాభరస్వాంత నీనాడు నీదాననై దీననై దాసినై వచ్చితిన్ స్వామి, నన్నీవు
మన్నించి పాలింపు మోవాయుదేవా నమస్తే నమస్తే నమః

అని ప్రార్థించుచునున్న అంజనను ప్రేమార్ద్రప్రసన్నాస్యుడై
అనిలుం డాదట నెత్తి ముద్దులిడి బాహాసంగతాలింగన
ప్రణయక్రీడల దేల్చె, నాలలనయున్ భాస్వన్నవోద్వేగ మో
హన హేలా పరిరంభసంభ్రమ కళావ్యాలోలయై చొక్కగన్.

ఆంజనేయుని జననము

ఆసంయోగఫలాప్తి నంజనకు సద్యఃప్రాప్త గర్భోదిత
శ్రీసంపన్ను డమోఘపాటవ జవస్థేమ ప్రసిద్ధైకవే
షాసర్వస్వు డొకండు పుట్టె సకలాశావ్యాప్త దివ్యచ్ఛవీ
రాశీభూత మహఃప్రభావవిశద ప్రౌఢప్రతాపాఢ్యుడై.

ఇట నట్లంజనకున్ సుతుండు కననయ్యెన్ దివ్యతేజోమయ
స్ఫుటదీప్తిప్రథమాన రమ్యముఖు డస్తోకప్రభాశ్రీకుడై;
అటుప్రాచీదిశ భానుబింబ ముదయంబై తోచె ప్రాదుర్భవత్
పటుదీప్తారుణ హేమవర్ణ కిరణప్రద్యోత మాంజిష్ఠమై.

జననముతోడనే పసిడిజందెములున్ మణికుండలమ్ములున్
మణిగణ మేఖలాకలిత మంజులభూషణముల్ వెలుంగ నం
జన కుదయించె నాశిశువు చక్షురుదాత్తమహోత్సవమ్ముగా
కనదురుకాంతిమత్కిరణ కాంచనవర్ణ మనోజ్ఞదేహుడై.

ఆసలు పండి నాకనులకద్దిన వెల్గుగ పుట్టినట్టి ఈ
నాశిశువింక ప్రాజ్ఞుడగు నాటిది మాటగదా మహేశ్వరా!
ఈసుకుమారు భార మదియెల్లను నీయది, వాయుమూర్తిదిన్
నాసకల మ్మితండని యొనర్చిన దంజన వేయిప్రార్థనల్.

భాసురోదీర్ణబలు డంజనాసుతుండు
ఉదితతేజస్కు డాంజనేయుం డతండు
కన్నతల్లికి కనువిందుగాగ తాను
పుట్టినప్పుడె పటుసత్వపూర్ణుడయ్యె.

ఆకుమఱుంగుపిందె యటు లంజన యాపసిబిడ్డ నెట్టులో
సాకిన దొండురెండు దివసమ్ములు స్తన్యము లిచ్చి గాని తా
నాకలితీర కప్పుడపు డాపసికూనయు పోరుపెట్టగా
ఆకెయు నేమితోచక భయాకులయై కనుచుండు నిస్పృహన్. 40

మూడుదినముల పసిబిడ్డ, ముద్దుశిశువు
నిముసనిముసమ్ముననకు సమున్మేషమహిత
శక్తిశాలియు చటులతేజస్వియగుచు
అంజనానేత్రయుగ్మ పద్మార్కు డయ్యె.

అతిశయదేహసౌష్ఠవసమన్వితు డంచిత సత్వపూర్ణుడా
సుతునకు పాలుచాలమియు చుమ్మలుచుట్టు ఫలాసవద్రవం
బతని కొసంగ నంజనయు నాతురయై వనికేగె పండ్లకై
సుతు నట వీడి; ధాత్రి కడుచోద్యము లాతురపాటు కర్జముల్.

పద్మప్రతానమ్ము భక్తిమై జేసిన పరమనిష్ఠాతపఃఫల మనంగ
క్షితిని గ్రమ్మిన కారుచీకటుల్ దొలగంగ సురలు వెల్గించిన జ్యోతియనగ
ప్రత్యుషస్నాతయై ప్రాగ్దిశావిమలాంగి నొసలిపై నిడిన సిందూరమనగ,
భూమండలం బెల్ల పాలుపార పండించి కూర్చిన బంగారు కుప్ప యనగ,

భానుబింబమ్ము వచ్చె పూర్వాద్రిపైకి
తనకు దీటైన కాంతి వితాన మమర
అవలనెవ్వడొ వెల్గుచున్నట్లు దలచి
ఆంజనేయుని జూచుట కరుగు కరణి

ఆంజనేయుడు సూర్యుని పట్టుటకు మింటి కెగురుట

అకలికాగలేనివెత నట్టిటు జూచుచు నాంజనేయుడున్
ప్రాకటరీతి ప్రాగ్గిరులపై వెలుగొందు సువర్ణవర్ణశో
భాకమనీయభాస్కరుని పక్వఫలమ్మనుచున్ గ్రసింపగా
దూకె నవార్యవేగబలధూర్వహుడై గగనాగ్రవీధికిన్.

చదలన్ జీల్చుచునేగు విద్యుదిక చంచద్రేఖికా వేగియై
విదితావేశజిగీష విక్రమధురాభీలాకృతిన్ భాస్కరున్
గదియంబోయెడి అంజనాసుతుని నాకమ్మందు వీక్షించి రి
య్యదియేదో విపరీతభూత మని నాకావాసు లుద్విగ్నులై.

ఆరీతిం జను మారుతాత్మజుని వైపై దారికడ్డమ్ముగా
నౌరా వీడెవడో నిశాచరాధముడు నాకాహారమై యొప్పునీ
నీరేజాప్తుని పట్టబోవు ననుచున్ నిర్వేల విద్వేషసూ
చీరోషశ్వసనుండు రాహువరుదెంచెన్ కోపతాపోగ్రుడై.

ఇదియును మంచిదైనదిబలే! ఒకనల్లనిపండటంచు స
మ్ముదమున రాహువున్న దెస పోయెడి మారుతపుత్రు విక్రమా
స్పద పటుధాటికిన్ నిలువజాలక పర్వులువెట్టె చిత్తమం
దదవదయాచు రాహు వమరాధిపునిన్ శరణమ్ము వేడగా.

స్రగ్విణి

రాహువున్మ్రింగ నుగ్రాకృతిన్ దూకుచున్
సాహసోద్వృత్తితో స్వర్గవీధిన్ మహో
త్సాహియై వచ్చు సందర్భితోద్వేగవత్
దేహునిం జుచుచున్ దేవతల్ భీతులై.

విబుధేంద్రున్ గని మ్రొక్కి దేవ ! యెవడో విన్వీధి లంఘించుచున్
ప్రబలోగ్రాకృతి రాహువున్ దరిమి, స్వర్వాసమ్ముపైవచ్చి దే
వబలమ్మున్ బెదరించుచుండె నతనిన్ వారింప ధైర్యప్రభా
విభవోద్ధత్యము చూపి కావు మనుచున్ విజ్ఞప్తులం జేయగా.

ఆంజనేయుని మూర్ఛ

దివిజావాసము జొచ్చి నిర్భయముగా ధీరోద్ధతిన్ జూపు వా
డెవడాతండు? వచింపు డీనిముసమందే వాని నంకించి మ
త్పవిధారల్ చవిజూపి వత్తు ననుచున్ వైళంబ వెల్లేన్గుపై
దివిజాధీశుడు వచ్చె వాయుసుతు నుద్దీపించి చెండాడగా. 50

దిననాథున్ కబళింపనేగెను మహోధీరాత్ముడై, రాహువున్
వెనువెంటం జని దాకి డీలుపఱచెన్, నేడిట్లు దర్పోద్ధతిన్
గనుమాటై బడి వచ్చు వింద్రుడొకలెక్కా! మారుతాత్మోద్భవుం
డనుమానింపక వేగపోదొడగె నాకాధ్యక్షుపై కుగ్రుడై.

హతధైర్యుండయి యింద్రు డాకపికుమారౌద్ధత్యమున్ మాపగా
నితరాస్త్రప్రతతుల్ వృథాయనుచు నెంతే యోచనంజేసి అ
ప్రతిమప్రాభవపాటనప్రథితమౌ వజ్రాయుధమ్మున్ మరు
త్సుతుపై వేసెను తద్రయోపహతి దిక్స్తోమమ్ము లూటాడగన్.

అనుపమ దుర్దమోగ్రవిభ వాంచిత మాపవి, శైలపక్షపా
టన మహిమోజ్జ్వల మ్మది హుటాహుటి వచ్చి సమీరసూతికిన్
హనువున దాకి తద్రఢిమ కాగక వెన్కకు బోయె;నామరు
త్తనయుడు మూర్ఛలో మునిగె తత్పవిఘాత కొకింత నింతలో.

శైశవచాపల మ్మెసగ సాహసవృత్తి తనూజు డిట్టులా
కాశపు టెత్తు దూకి కడకన్ తుద కాదివిజేంద్రుచేతి ఘో
రాశనిపాతసంహతికి నై స్మృతిదప్పుట జూచి యాగ్రహా
వేశమనస్కుడై సుతుని వేగమె దాగొనిపోయి వాయుపున్.

త్రిభువననేత యింద్రునికి తీరికగా దనవజ్రహేతిసం
ప్రభవముచూప, మాచిఱుతపాపడెకన్పడెనా! మఱిప్పుడా
ప్రభుతయు చూతుగా కనుచు పంతమునం జని వాయుదేవుడున్
రభసముతో సమీరవిసరమ్ముల నాపెను వీవకుండగన్.

వాయూద్గారిత వీచికాప్రసరణ వ్రాతమ్ము స్తంభింపగా
ఈయావజ్జగమందు ప్రాణితతిలో ఏకైకకాలమ్మునం
దాయుర్వాయువు లాగిపోయెడి విపత్తారంభమై జీవుల
య్యాయంచున్ మొఱపెట్టె నావిలయకాలోత్పాతదుఃఖమ్మునన్.

ఉసురుసు రని ప్రాణిచయం
బసువులు గుప్పిట నిడుకొని యావేదనతో
శ్వసనము లాడక మరణ
త్రసనం బిదియని వగచుచు తల్లడమందన్.

జరిగినదానికిన్ వగచి సత్వర మాదివిజేంద్రు డార్తిమై
పరువున పద్మసంభవుని వద్దకు నేగి వచింపగా నతం
డిరవుగ దాను చేయగల దేమియులేక విలంబన మ్మికన్
కరము విపత్కరమ్మనుచు గ్రక్కునలేచి రయప్రయాణుడై.

అనిలుడు పుత్రునిం బొదివి యంకమునందున జేర్చి లాలనల్
బొనరుచు నుండగా, దివిజముఖ్యులు నింద్రుడుగూడ తోడరా
వనజభవుండు వేగముగ వాయువునొద్దకు జేరి ముందు దీ
వనలొనరించి యానిసుగుపాపనిమూర్ఛను బాపి యిట్లనెన్.

ఆలింపగదవయ్య యోయనిల ! మాయభ్యర్థనన్, వేగమే
పాలింపంగదవయ్య లోకముల, నీవాయుప్రసారమ్ములన్
దేలింపంగదవయ్య మమ్ము, విలయార్తి క్రూర సంక్షోభమున్
చాలింపంగదవయ్య సర్వజనరక్షాశీలమాన్యుండవై. 60

వినుమీ నీదుసుతుండు చూపిన మహావీరోచితక్రీడ కీ
తని విఖ్యాతి పదింతలైనది, జగత్సర్వమ్ము హర్షించి వీ
నిని దీవించి నుతించుచుందు రిక కానీ, వాయుదేవా మదిం
గనుమీ న్యాయము; ఒక్కబిడ్డకయి లోకమ్మెల్ల చంపింతువా.

అని వారాడిన పల్కులెల్ల పవనుం డాలించి యోచించి చ
య్యన వాయుప్రసరమ్ములన్ నినిపె బ్రహ్మాండమ్మునన్, బిగ్గబ
ట్టిన ప్రాణమ్ములు లేచివచ్చి యలరెన్ డెందమ్ము లానందభా
వనిరూఢిప్రకటమ్ములై మరల సర్వప్రాణిలోకమ్ములన్.

ఏవలనన్ భయమ్మొసగ దీపసికూన ధరిత్రిపై చిరం
జీవియు భక్తశేఖరు డజేయుడు జ్ఞాని అనంతకీర్తిరే
ఖావిభవుండు సాధుజనగణ్యుడు నౌనని సర్వదేవతల్
దీవనలిచ్చి రాశిశువుదేహమునున్ హనువున్ స్పృశించుచున్.

మ్రొక్కెను వాయువు బ్రహ్మకు
మ్రొక్కించెను శిశువుచేత, మునిసుర లానా
డక్కడ కేతెంచిన వా
రక్కజపడి రాత్మలందు హనుమను గనుచున్.

దొరకిన పండుల గొని వెను
దిరిగిన యంజన తనయుని దిగబెట్టిన చో
టరసియు శిశువును గానక
వెరగున నటుదిటు దిరుగుచు విహ్వలమతియై.

పాపమనంగ బోక పసివానినిటుల్ దిగబెట్టిపోయి తీ
పాపని దొంగలించుకొని పర్విడి రెవ్వరొ నాయురమ్ములన్
చేపినపాలు ధారలయి చిందుచునున్నవి గుండెలోతులం
దూపిరికూడ ఆడదుప్రభూ! ననుసైరణ జేసి బ్రోవవే.

అని వాపోయెడి అంజన
కనువిందుగ వచ్చి నిలిచె కరువలియటకున్
హనుమంతునిగొని ; వేగమె
వినిపించెను సర్వకథయు విస్మయమెసగన్.

కనుగవను బాష్పధారలు కాల్వగట్ట
అంజనయు బిడ్డ నురముల కద్దుకొనుచు
ఇంతలో నెంతయయ్యె తండ్రీ! యటంచు
దృష్టి దిగదుడ్చి దేహము నెల్ల నిమిరి -

ఎవ్వడో దేవు డిట్లు రక్షించెగాక
దక్కుదువె నాకు బంగారుతండ్రి ! ఎంత
కక్కటిల్లిపోయితివొ నన్నానకనుచు
పాలు కుడిపించె నాయమ బాలునకును.

సురుచిరచేష్ట లా నిసుగుసుద్దులు వేగమె తీయముద్దులై
మరల మఱొక్కసారి యని మారిచిమారిచి తల్లిదండ్రులా
చిఱుతను ముద్దులాడుచును చేతులకెత్తి ఒకళ్ళొకళ్ళలో
కరగిరి పూర్వపున్ మధురగాథలు మోముల హాసరేఖలై.

కనుమొఱగియుండ దంజన
హనుమంతుని వీడి యొక్క అరగడి యైనన్;
కనుపఱచును విద్దెములన్
హనుమం దేమియు నెఱుగని య ట్లంజనకున్.

మారుతాత్మజు డగుటచే మారుతియని
అనిమిషేంద్రు వజ్రాయుధహతిని తనదు
చెక్కిలికి దెబ్బతగులుటచేత భువిని
ఆంజనేయుడు హనుమంతు డనగ నెగడె.

### హనుమంతునివిద్యాభ్యాసము

ఒకనా డంజన బాలునిం బిలిచి బాబూ ! పెద్దవాడైతివీ
విక విద్యల్ గడియించి పేరుగొనుమీ విశ్వమ్ము నిన్మెచ్చగా,
అకలంకోజ్జ్వల పండితుం డినుడు నీకాచార్యుడౌగాక ఆ
యినునింజేరి విపశ్చిదగ్రణివి తండ్రీ కమ్ము శ్రీఘ్రమ్ముగా.

అని దీవించిన తల్లిపాదములయం దానందబాష్పాంబువుల్
ధునులై పాఱగ మ్రొక్కి లేచి హనుమంతుండంత యేనాడొ పం
డని మ్రింగం జని నట్టి భాను డిల నేడారాధ్యుడౌ సద్గురుం
డని భావించుచు సూర్యుజేరె శ్రుతిశాస్త్రాభ్యాస దీక్షాదృతిన్.

హనుమంతుంగని దీవనల్ నుడివి యయ్యర్కుండు విద్యాభిలా
షను నావద్దకు వచ్చినాడ విటు లీషట్కాల పర్యంత మా
గని వేగమ్మున నేచరింతును గదా కాలూన కెచ్చోటనై
నను నాచెప్పుట నీవునేర్చుటయు హన్మంతా అసాధ్యంబనన్.

ఆగనట్టి సంచలనమం దనవరతము
విశ్వమందీవు గురుదేవ వెడలుచుండ
నెట్లు నీప్రబోధమ్మాలాలింపనగునో
ఇంతియేకద సందియం బెడదమీకు.

దానికి నేభయంపడను తామరసాప్త! యటంచు నొక్కకా
లూనుచు పశ్చిమాద్రిని మఱొక్కపదమ్మను ప్రాగ్గిరీంద్రమం
దానుచు మారుతాత్మజు డహస్కరుజూచి నమస్కరింపగా
నానిపుణత్వముం గని యహర్పతి యాతని శిష్యుగా గొనెన్.

ఒక సర్వాగమసర్వశాస్త్రగత విద్యోత్కర్షు డధ్యాపకుం
డొక దీక్షావిలసత్ కుశాగ్రశితమేధోత్తంసుడున్ ఛాత్రు డా
ప్రకటోత్ప్రేరిత బోధనాధ్యయన సారస్వాదు రేఖావధుల్
సకలశ్రీపరిషత్తులై వెలయు ఆచార్యత్వశిష్యత్వముల్.

విదితోద్య త్ప్రతిభా సముజ్జ్వలకళాభిఖ్యుండు సామీరి, తా
చదువ న్నేర్చెను ప్రత్యహమ్మొక మహాశాస్త్రమ్ము నాద్యంత మా
సదసత్ జ్ఞానవిధేయు డింతటి యభిజ్ఞాశాలి శిష్యుండవన్
హృదయమ్మందతివేల హర్షమున గర్వించెన్ వివస్వంతుడున్.

సంగీత, మ్మఖిలాగమార్థ విపులజ్ఞానమ్ము, శాస్త్రార్థవి
ద్యాంగీకారితసారసౌరభ ముపజ్ఞాధిక్య సర్వస్వదై
సాంగోపాంగముగా గ్రహింపగలిగెన్ హనుమంతు డాదిత్యుస
త్సాంగత్యమ్మున దేవతల్ సయిత మాశ్చర్యమ్మునన్ దేలగా. 80

సకలసద్గుణమూర్తి యంజనయు జనని,
జన్మమరయ మహేశ్వరాంశప్రశస్తి,
చండవేగాతిబలు డనిలుండు తండ్రి,
సకలశాస్త్రదేశికుడు భాస్కరుడు గురుడు;

సాధువర్తనమధుమూర్తి, సకలభువన
మాన్యమహిము, డజేయు, డనన్యసాధ్య
వేగసత్త్వుడు, విద్యావివేకవేది
యగునుగాక అంజనసుతుం డన్యుడగునె.

పరమాత్మసముడ వస్మ
ద్గురుడవు మీకుందినకర! గురుదక్షిణగా
నెఱుగం జేయు డెదేనిన్
నెఱవేర్తు ననుచు హనుమడు నియతిన్ మ్రొక్కన్-

కీశశ్రేష్ఠుడు నాసుతుండొకడు సుగ్రీవుండు కిష్కింధలో
వాసంబుండును, నీవు నాతనికి విశ్వాసంబునన్ మంత్రివై
నీశక్తిం గనుపర్చు మిద్ది జగతీనిశ్రేయ మౌనం చినుం
డాశీర్వాదము లిచ్చి పంపె హనుమన్ హర్షప్రసన్నాత్ముడై.

అనుపమపాండితీవిభవుడై యఖిలాగమశాస్త్రశేముషీ
వినుతమహామనస్వియు వివేకవిదాంవరకీర్తిశాలియై
హనుమడుపోయి భక్తితొలుకాడ ప్రదక్షిణ మాచరించుచున్
జననికి మ్రొక్కె నామె నలినాంఘ్రుల రాల్చుచు మోదబాష్పముల్.

భాస్కరుని శిష్యుగా తాను పంపినట్టి
బాలు డానాడు; జ్ఞానప్రభావ భవ్య
సకలశాస్త్రార్థతత్త్వ తేజస్వి నేడు;
తనయునుం గని పొంగిపోయినది జనని.

తనయుని జూచి తల్లియును, తల్లిని జూచిన యాకుమారుడున్
మునిగి రమేయమోద పరిముద్రిత మాధురసానురక్తులన్
హనుమయు నంత కొంతవడి కాజననీ కరవల్లికోపగా
హనములనుండి వెల్వడి తదంఘ్రుల వ్రాలి వినమ్రవాక్కులన్.

అంజనహనుమనుసుగ్రీవునికొలువునకనుపుట

భూవలయాన నేనిటుల పుట్టుటకున్ కతమైన సత్కృపా
దైవతమూర్తివమ్మ గురుదక్షిణ తీర్పగ శీఘ్రమేను సు
గ్రీవుని కొల్వు జేరవలె ప్రీతిగ బంపుమనంగ పుత్రమో
హావిల బాష్పసిక్తముఖియై సుతు నంకమునందు జేర్చుచున్.

ఇటనున్న దెపుడు తండ్రీ!
పటుతరములు నీచదువులు బలవిభవమ్మల్
స్ఫుటముగ నేగన్న దెపుడు
కటకట ! నినుగన్న దేను కానల కొఱకా !

చనుమని యెటు లన జాలుదు
నినువీడి యిచట నొకతెను నిముసం బేనిన్
మనజాలుదునా నాయన
హనుమా! విను మొక్కమాట యను చంజనయున్. 90

చెలిమిని కేల్గ్రహించి దరిజేరిన కేసరి యేగె యోగియై,
వలచిన వాయువైన నిలువం డిట దిక్తటులెల్లవానివై,
కలిగిన బిడ్డ వొక్కడవుగా నినువీడుట' యెట్టులోయి ఆ
నలువకు నేనె గావలయునా నుదుటన్ లిఖియంప నీగతిన్.

ఆగుమురా క్షణమ్ము తనయా యని యక్కున జేర్చి, వద్దు నీ
వేగకు మాకపిప్రవరు డెవ్వరొ నేనెఱుగన్ ధరిత్రి నీ
వేగద దిక్కటంచు విలపించుచు ఆకలియయ్యె నీకటం
చాగని చన్గవన్ గుడిపె నంజన హన్మను జేరదీయుచున్.

భానునిబట్టగా గగనభాగము లేగినధీరు డింద్రునిన్
బూనిక నిల్వరించు బలుపున్ గల వాడిటు తల్లికౌగిటన్
దానొక బిడ్డడై యొదిగె; దైవ మె తానొనరించు ప్రేమసం
ధానము లుర్వి బిడ్డలకు తల్లుల కీయనురాగ బంధముల్.

కాదనజాల డా గురువుకామిత మిచ్చుట తల్లిపొందు నా
వేదన చూడలే, డెడద బీటలువాఱు కలంత లివ్వియే
నాథుడు తీర్చునో యని మనమ్మున చుమ్మలు వోవు హన్మ డె
ట్లో దిగమ్రింగి తల్లి కొకయూఱట మెల్లన బల్కునంతలో.

హనుమను నిల్పకింక అతివా ! యతడేగుట దైవకార్య మా
యినుని యభీప్సితమ్మిది మఱెట్టి భయమ్మును లేదు శ్రేయమై
చను నిది ధాత్రికే యనిన చల్లనిమాటలు వాయులీనమై
వినబడి నెమ్మదిన్ తెరలువీడినరీతి గ్రహించె నామెయున్.

తనయుని బ్రీతి మూర్కొనియె తల్లియు, తల్లికిమ్రొక్కి హన్మడుం
దన చెయిజంట మోడ్చె గురుదైవము భాస్కరమూర్తి కాదృతిన్;
మనమున వాయువుం దలచి మాతయు ఏమివచించి పంపునో
యని తలపోయు బాలునికి నంజనయున్ జెమరించు కన్నులన్.

ఇనునిమనోరథమ్ము నొనరించియెతీరవలెన్ మఱిప్పుడా
వనచరవీరు గొల్చెదవా; భక్తుడవై వనజాక్షు గొల్చెదో
పనిసకలమ్ము నీది యయి భాసిలు నీవెట నున్న గూడ నా
తనయుడ వోయి నిన్నుగని ధన్యతగాంచితి నయ్య నాయనా!

అని మఱియొక్కమారు హృదయమ్మున పుత్రుని శీర్షమద్ది నీ
వినయము విక్రమోన్నతియు విద్యయు విజ్ఞత నిన్నుగాచు, ని
న్ననిలుడు గాచు, కాచు నినయమ్ము మహేశుడు; నీదు తల్లిదీ
వనలివి నాయనా! భువన వంద్యుడ వౌదువు తథ్యమింతయున్.

పరమవిజ్ఞానమతివి తుభ్యం జయోస్తు
పరమవిక్రాంతి ఖనివి తుభ్యం జయోస్తు
పరమవిద్వదగ్రణివి తుభ్యంజయోస్తు
అనుచు నంజన దీవించి హనుమ ననిపె.

తనయు డొకపెద్దగండమ్ము తప్పి బ్రతికి
ఎట్టులెట్టులో ఈనాటి కినుని కరుణ
నాల్గుముక్కలు నేరిచి నన్నుజూడ
అరుగుదెంచె నావద్ద నున్నటులె లేదు. 100

అని తన మనమున తలపోయుచునే అంజన,

నిరతము తనపదసేవల
జరుపదగిన సుకుమారుం జయ్యన మదినే
యరియరి లే కనిపిన దా
వరసుతుని భవిష్యమేమి భావించినదో.

తల్లివైపు జూచుచునె యాతనయు డరిగె,
కనులకనబడు దన్క నాహనుమ వైపె
మాటిమాటికి జూచు నా మాతృమూర్తి
కనులకవరోధమై యశ్రుకణము లురలె.

పెరిగినది మురిపెముగ కుంజరుని యింట,
పరిణయ మ్మాడె వలచి కేసరిని దాను
అనిలుసంగతి పుత్రునిం గనియె గూడ;
కనుపడరు నేడు జగతి నంజనకు తోడు.

తోచియు తోచనీనిగతి తొందరలేవొ కలంచు దేహమం
దే చిఱుగాలి సోకినను ఏసడివిన్నను నామె దిక్కులం,
జూచుచు నెవ్వరిన్ గనని శోకమునన్ బడి దేవుడే ననుం
బ్రోచును గాక యన్న తలపుంజడిలో నొనరించు ప్రార్థనల్.

పరిణయమైనదే మొదలు వంతల పాల్పడి చిత్తశాంతియే
యెఱుగని యంజనా సతియు ఏమియు దోచని రీతి నుండగా
సురభిళ శీతలోర్మికల సొంపులదేల్చి సమీరు డూఱటల్
నెఱపగ శాంతియున్ గలిగె నెమ్మది నంజన కంతకంతకున్.

ప్రీతిన్ బిల్వదళమ్ము లేరి శివునర్చించున్, నవోన్మేషకం
జాతమ్ముల్ గొని తెచ్చి నచ్యుతుని పూజల్ సేయు, సంక్షేమసం
ధాతల్ మీరలె కావగావలె నిలన్ నాబిడ్డ నంచున్ శుభ
ప్రాతర్వేళల ప్రార్థనల్ సలుపు నిత్యమ్మంజనాదేవియున్.

ఆశ్వాసాంతము

వినుతం బతిరమ్యంబిది
హనుమంతుని జననగాథ అద్భుతచరితం
బనుపమ మృదుపద మధురము
వినిపించితి రామ! నీకు వినివేద్యముగా.

నిరుపమగుణుండవును నీవు నిర్గుణుడవు
చారుబహురూపుడవు నిరాకారుడవును
సర్వముభరింతు వీవెనిష్కర్ముడవయి
ఎవ్వరని యూహసేతు నిన్నేను రామ!

ఆనందము నీ నామము
ఆనందము నిన్దలచిన యపు డోరామా
ఆనందరాముడవు నీ
యానతి యానంద మఖిల యత్నములందున్. 110

ఇది అంజనా కేసరుల ప్రణయ విహారము, కేసరి వైరాగ్యము అంజనా వాయు దేవుల కలయిక, ఆంజనేయుని పుట్టుక ఆంజ నేయుడు మింటి కెగురుట. బ్రహ్మాదుల వరములు, సుగ్రీవుని కొలువునకై ఆంజనేయుడు బయలు దేరుట యు నను కథలుగల శ్రీ హనుమత్ప్రబంధము నందు ద్వితీయాశ్వాసము.

# శ్రీహనుమత్ప్రబంధము

తృతీయాశ్వాసము

శ్రీమ త్సారస నేత్రా
శ్యామాంబుదవర్ణగాత్ర సాధుచరిత్రా
భూమీసుత చిత్తాంబుజ
ధామోదయ బాలమిత్ర దశరథపుత్రా!

శ్రీరామచంద్ర దేవా, అవధరింపుము

సుగ్రీవుని వద్దకు హనుమంతుడేగుట.

ఒకమహనీయు డాశయసమున్నతుడై పొనరించు కార్య మీ
సకలజగత్ప్రియంకరము సత్యసముద్ధరణైక సాధనా
త్మకమయి ధర్మగౌరవవిధమ్మగుచో తదశేషదివ్యభా
వుకమహనీయతల్ మఱచిపోవదు లోక మ దెన్నినాళ్ళకున్.

ఎన్నాళ్ళుండును గురువరు
డన్న పనిని వెన్క బెట్టి హనుమం డింటన్
కన్నమ్మయు బ్రీతితోడ
గ్రన్నన దీవించి యనుప కదలెన్ తానున్.

శ్రీకరమంచు తల్లియు వచించెను నాపయనించువేళ నీ
వేకపివీరుగొల్చెదవొ యేకమలాక్షుని గొల్చెదో యటం
చాకథలవ్వి రెండును యథార్థము లౌ కరణీయ ధర్మముల్
నాకగుగాతమంచు పవనాత్మజు డాత్మ దలంచె నేగుచున్.

స్ఫారోదార వసంతపుష్పవిగళత్ సౌరభ్యపారంపరీ
పారమ్య ప్రవిలాస భాసురము పంపాతీర మాకానన
శ్రీరమ్యస్థిరసంపదుజ్జ్వలము కిష్కింధామహారాజ్య మా
దారిం బోవలె చేరగావలెను తత్ప్రాంతమ్ము సామీరియున్.

ఎచ్చటి ప్రభాసతీర్థం
బెచ్చటి కిష్కింధయు నిక నెప్పటికేగన్
వచ్చునొ మది నెఱుగక యే
చెచ్చెర హనుమంతు డరిగె స్థిరతరధృతియై.

కారుమొయిళ్ళచీకటులు గ్రమ్మిన కాననసీమ, శీఘ్రయా
త్రారతి నాతడేగెడి పథమ్ములయందున భాస్కరానిలుల్
వారయి వచ్చి చీకటులు పాఱగద్రోలుదు రా మనోహరా
కారుని కాంజనేయునికి కల్గనీరు శ్రమం బొకింతయున్.

సాకేతమ్ముననుండి రాముడరిగెన్, సామీరియున్ నేడిదే
కీకారణ్యము లంటి పర్వులిడు నాకిష్కింధకున్ ధర్మకా
ర్యైకవ్యగ్రులు వీరలిర్వురును దైత్యాధీశవిధ్వంసన
మ్మొ కాలమ్మరుదెంచుచుండె నని యాహ్లాదాత్ములైవేలుపుల్.

మధ్యాహ్నము

మారుతపుత్రుడీఘనుడు మానిత మహిమాతిశయుడు
పార మెఱుంగని వేగపాటవ ప్రథమాన బలుడు
ధీరు డీకపివీరు డఖిలదిగ్జయ సాహసుం డగుచు
ధీరమ్యు డగుగాక యనుచు దీవనల్ తెలిపి రెల్లరును. 10

ఆవనసీమ కావలగ నచ్చటనే పొలుపారు కీశరా
జ్యావని, వాలి పాలనము సల్పుచు తమ్ము డటంచులేక సు
గ్రీవునిబట్టి బైటకునుగెంటి బలాత్కృతి తత్సతిన్ రుమన్
గైవసముం బొనర్చుకొని కాముకకేళి చరించు దుష్టుడై.

చేవగలట్టి వాలియును చేరగరానివి ఋశ్యమూకశై
లావృతసీమలన్ తనబలమ్ములు తోడయిరాగ నేగి సు
గ్రీవుడుడాగె, వాలి విపరీతదురాగతవృత్తు లీగ నే
దైవము సాయమై తనకు దారి నొసంగునొ యన్న చింతతో.

ఇనునితనూజుడైన మహనీయుడు, దుర్దమధైర్యసాహసో
ద్ధనబలశాలి యయ్యును సుకంఠుడు వాలినెదుర్చు దర్పముం
గనని విషాదమగ్నుడయి కాలము బుచ్చుచునుండె, మంచివా
దినములు లేనియప్పు డతిధీరుల కైనను తప్ప వీవెతల్.

హనుమండున్ మది నింతదన్క నెఱుగండాగాథ, గుర్వాజ్ఞపై
తనకర్తవ్యము నిర్వహించు పనిలో తానిట్లు సుగ్రీవుకా
ల్వను చేరంజనె; దైవనిర్ణయపు చెయ్వుల్‌గూడతోడౌను, దు
ర్జనదుర్మార్గము లెల్ల డీల్వడు ముహూర్తం బుర్వి నేతేరగన్.

ఆకసమంటు శైలశిఖరాగ్రము లల్లన నెక్కిదూకి, అ
స్తోకజలప్రవాహ పరిశోభిత వాహిను లీది దాటుచున్
కాకియు లోనికిం జనని కాననసీమ లతిక్రమించి పం
పాకమనీయదేశమును పావని జేరె క్రమక్రమమ్ముగా.

అరిగెడుచోటు దగ్గఱగనైన కొలంది సమీరపుత్రుహృ
త్సరసిజ మల్లనన్ విరియసాగిన; దచ్చటతానువానరే
శ్వరునకు మంత్రిగా చను మిషన్ మహితోత్తమ దైవకార్య మొం
డిరవుగ చేయు రీతిని దినేశుడు పంపుచునున్న యట్టులై.

**విజయభద్రము**

అదిమాధవమనోజ్ఞ మతిసుందరతరమ్ము
అద్రిశైలసముపేత మతులోజ్జ్వలవనమ్ము
అదివానరుల రాజ్య మవిజేయమగు భూమి
అదియే పవనసూతి కరుగంగ దగు సీమ.

వర్షామేఘ వినీలసుందరతనూ భాస్వన్మహాతేజ ము
త్కర్షంబైన కృపాభిరామ మధురాకారమ్మెదో నెమ్మదిన్
హర్షం బొప్పగ పిల్చుచున్నటుల నేత్రాంతమ్ములం దోచి యా
కర్షింపన్ ద్విగుణీకృతోత్సుకత నేగంజొచ్చె హన్మంతుడున్.

చాంపేయాగురుమల్లికాది సుమనస్సౌరభ్య వీచీస్ఫురత్
సంపన్నమ్ము తనుశ్రమాపనయన స్వారస్య సాకల్యమై
పంపాతీరసమీపకానన చల ద్వాయు ప్రసారమ్ము నై
లింపశ్రీ వనసౌఖ్యముల్ నెఱపి లాలించెన్ హనూమంతునిన్.

అచ్చపు తీయతేనెపెఱ లచ్చులు పోసిన క్రొత్తసోంపులై
యచ్చట తాను కాలిడిన దాది మహోదరభావపూర్ణసం
పచ్చయసాధురూపవిభవమ్ములు వన్యపథమ్ము లన్నియున్
మచ్చికలై కనంబడెను మానసవీధిని వాయు సూతికిన్. 20

హనుమ త్సాహసకృత్యముల్ సకలశాస్త్రాభ్యాసపాండిత్యముల్
మునుపే విన్నవి తాను సర్వమును సమ్మోదమ్ముతో తాదృశ
ప్రణుతాత్ముం డెవడేని తోడయినచో రాణించు నాభాగ్యమం
చును సుగ్రీవుడు మానసమ్మున దలంచున్ నిత్య మత్యాశతో.

ఇంతలో వచ్చె వార్త దినేశునుండి
ప్రియముగూర్చుచు మిగుల సుగ్రీవునకును
తనకడకె వచ్చుచుండెను హనుమ యనుచు
తండ్రికిని నొవ్వులే గద తనయు వెతలు.

పోవలెను వేగ తాను సుగ్రీవుకడకు
అచ్యుతసముండు సూర్యనారాయణునకె
కూర్చునట్టి పుత్రుండు సద్గుణవరేణ్యు
డాకపిశ్రేష్ఠు డెట్టివా డగునో యేమొ.

ఎంతదూర మీరీతి దానేగవలెనో
ఏదో గిరియట యతడు వసించు నెలవు
మద్గురువరు కృపామహిమమ్ము వలన
వారికిని నాకు మేలు గావలయు నచట.

ఏవిధి తాను పోయి దరిసించుట, లామహనీయమూర్తితో
నేవిధి మాటలాడుటయొ యేనని పావని యెంచు నంత సు
గ్రీవ నికేతనప్రకట కేతన నూత్నపటాంచలమ్ము లా
తావుననే కనంబడె నుదాత్తమహత్త్వభవిష్య దర్థముల్.

అతనిచరిత్ర మెట్టిదియొ ఆత్మనెఱుంగడు భానుమూర్తికిన్
సుతుడయి పొల్చు దివ్యగుణశోభితు డాతడు తానుపోయి యే
గతి ప్రియమారసేయుదునొ కర్జము లాయెడ నంచు నెమ్మదిన్
సతమత మౌచునే యరిగె సత్వర మాపవనాత్మజుం డొగిన్.

రాజ్యసింహాసనము లేక, రాణిలేక
గిరిగుహయె కొలువైన సుగ్రీవు మోము
రాజశీవి తగ్గియు నభిరామ మయ్యె
మబ్బుగ్రమ్మినసూర్యబింబమ్ముపగిది.

వెరవున కీశముఖ్యుడయి వేల్పుల కందని సౌఖ్యసంపదల్
విరివిగ పొందగల్గెడి వివేకయుతుండిటు ఋశ్యమూక భూ
ధరమున వాసముండిన కత మ్మెది యో యొక దుండవచ్చు నం
చరిగి నమస్కృతుల్ సలిపె నర్కతనూజున కాంజనేయుడున్.

శ్రీవిభవమ్ములైన కనుఱెప్ప లొకింతగ నెత్తి యాయెడన్
పావనిజూచె ధీరగుణభాసురుడైన బలిష్ఠమూర్తి సు
గ్రీవుని: యాక్షణమ్మనని కీశవరుండును జూచె బ్రహ్మతే
జోవిభవున్ మహోద్ధతభుజున్ దృఢకాయుని ఆంజనేయునిన్.

పేరు లికేల చెప్పవలె విశ్రుతకీర్తులు లోకవంద్యు ల
వ్వారికి ఆత్మలం దెలియవచ్చిన దెవ్వరు ఎవ్వరైనదిన్
చేరెను చేతులందునను చేతులు, డెందముడెందమందునన్,
తీరనికౌగిలుల్ తనివితీరని ప్రేమ లొకళ్ళొకళ్ళకున్. 30

తనశిష్యుం డొక డద్వితీయ బలవిద్యాశేముషీశ్రేష్ఠుడున్
తనపుత్రుం డిక వానరాన్వయ మహోధ్యక్షప్రభావంతు డీ
యనఘుల్ మంత్రియు రాజునై కలసి; రుద్యద్దిగ్జయోద్దీప్తమై
తనరున్ వారలమైత్రి నా వెలిగె మధ్యాహ్నార్కు డభ్రస్థలిన్.

పావని యంత తానిటకు వచ్చిన సంగతి సూర్యునాజ్ఞగా
పావనమూర్తి తల్లియును పల్కినదీవనగా వచింప, సు
గ్రీవున కాత్మ సమ్మదపరీతమునై తనువెల్ల పుల్కలై
పావని నాత్మకీయసచివాగ్రణిగా గణియించె నర్మిలిన్.

ఆతడు ప్రభువగునో మఱి
యీతడు భృత్యుండొ పరుల కెఱుకపడని సం
గాతంబై యిరువురి మై
త్రీతాత్పర్యము జననుత రీతిన్ దనరెన్.

వాలిసుగ్రీవులు

ఋక్షవిరజుడన్ వానరవృద్ధు డొకడు
శంభునిల్లాలు గౌరిచే శప్తమయిన
కొలనిలో దానమాడుచు కొమిరె యయ్యె
సురుచిరాకర్షక శరీర శోభలెసగ.

సురుచిరమూర్తి ఋక్షవిరజుం డటు లాహ్రదతీరమందు సుం
దరతరుణీవిలాసవిదితమ్మగు రూపముతో సుగంధసం
భరిత వసంతపుష్పవనవాటి విహారము సల్పుచుండగా
సురపతియున్ దివాకరుడు చూచిరి కూడిరి మోహమగ్నులై.

ఆవామాక్షికి వాసవు
చేవాలియు, మఱిదినకరుచే పదపడి సు
గ్రీవుం డను నిరువురు తే
జోవిభవులు పుత్రులైరి శూరవరేణ్యుల్.

బ్రహ్మవరమున పూర్వరూపమ్ము దాల్చి
కీశరాజ్య మేర్పఱచి కిష్కింధవద్ద
ఋక్షవిరజుడు పుత్రుల ప్రీతిదనర
పెంచి పెద్దజేసెను మహావీరు లనగ.

వాలి యవార్యదోర్బలుడు బాహుసహస్రము గల్గు హైహయున్
దూలగజేసె యుద్ధమున; దుర్మదవృత్తినివచ్చు రావణున్
వాలముజుట్టి నల్దెసల వార్నిధులందున ముంచిదేల్చెనా
భీలపరాక్రముం డతనిభీకరధాటికి సాటిలేరొరుల్.

శ్రీవిలస ద్విశిష్ట విదుషీమణి సూక్ష్మబుద్ధి మే
ధావిభవోజ్జ్వలాకృతిని తారను వాలియు భార్యగాగొనెన్;
భావజుబాణమో యనగ భాసిలుతన్వి రుమన్ గ్రహించె సు
గ్రీవుడు భార్యగా శుభపరీతము లిట్లు దినమ్ము లేగగా.

దుందుభినామక దుష్టదైత్యు డొకండు వాలిపై పోరికి వచ్చిపడగ,
వారిర్వురికి నొక్క పర్వతగుహయందు సమరమ్ము సాగి వత్సరముదనుక,
విననయ్యె దుందుభిభీకారార్భటు లంత రక్తముల్ పాఱె ద్వారములనుండి
దుందుభియు పయికి దూకిరాకుండగ పర్వతగుహ మూసి వానరాళి. 40

వాలి మృతుడయ్యె ననెడి విభ్రాంతిలోన
ఇల నరాజక సంక్షోభ మెనయకుండ
కీశరాజ్యాధిపతిగ సుగ్రీవునకును
పట్టముం గట్టి నిలిపిరి ప్రభుతమీర.

దుందుభింబట్టి దునుమాడి తుట్టతుదకు
దుర్నిరీక్ష్య రోషానలాత్యుగ్రరావ
ఘూర్ణితాశాతటోత్కట కుట్టిముండు
విజయభీకరుం డయి వాలి వెలికి వచ్చి -

కీశరా జ్యాధివాససింహాసనమున
తమ్ముని౦ జూచి, దుర్మదౌద్ధత్య మడర
ఔర ! ఇంతలో నెంతవాడైతి వీవు
ప్లవగరాజ్యమ్ము నపహరింపంగ ననుచు -

అనుజు డనుమాట వినకుండ కినుకమీఱ
నొక్కతన్నున సుగ్రీవు నూరినుండి
తరిమి పోద్రోలి యాతనితరుణి రుమను
గైకొనియె బల్మి కామాంధకారవృత్తి.

తనతప్పేమియు లేక అగ్రజునిచేతన్ శిక్షితుండయ్యు అ
న్నను సుగ్రీవుడు చూచి మ్రొక్కి వినుమన్నా దైవతుల్యుండుగా
నిను పూజించినవాడ నేటిదనుకన్ నిన్ వంచితుంజేతునే?
అనుమానింపకు లేదు రాజ్యమున నాకాకాంక్షయున్ లేశమున్.

బవరమ్మంచును నీవుపోయి గడచెన్ వర్షమ్ము; వార్తేమియున్
చెవులం జేరక నిన్నుగూర్చి, నను నీ సింహాసనమ్మందు నీ
ప్లవగుల్ నిల్పిరి; నేడె గైకొనుము నీభద్రాసన మ్మిందు నా
యవివేక మ్మగుచో క్షమార్హుడను గాదా తమ్ముడన్ దాసుడన్.

నమ్ముమువాలి! నాదువచనమ్మిది సత్యము నేవచించితిన్
సుమ్మని విన్నవించు ననుజుంగని కన్నుల నిప్పుగ్రక్కి పో
పొమ్మనిగెంటె వాలియును, బుద్ధివిహీనమనస్కు డక్కటా
నమ్మినవాని కాపద నొనర్చుట దేవుడుగూడ మెచ్చడున్.

తారతెలివి యేమొ, దైవ మెఱుంగును
రాణి కావలసిన రమణి రుమయె,
అందకత్తెయామె యని తలంచునుగాని
తనయఘమ్ము నాత్మ గనడు వాలి.

తమ్ముని బైటకుం దరిమి తమ్ముని భార్యను సోదరీసమన్
క్రమ్మిన కామసంగతవికారమునన్ గయికొన్న వాలికృ
త్యమ్మును గర్హణీయముగ నారసి జాంబవదాదులెల్లరున్
నమ్మినబంటులై చనిరి న్యాయగుణాఢ్యుడు సూర్యసూతితో. 50

తపసుపండిన మౌని మతంగఋషికి
ఋశ్యమూకమ్ము తనతపః క్రియలనెలవు
వాలియును రాడు తద్గిరిప్రాంతములకు
వచ్చెనా చచ్చుననెడి శాపమ్ముకలదు.

దుందుభిని చంపినపుడు తద్రుధిరసిక్త
మాంసఖండమ్ము లాయాశ్రమమున విసరి
పాడొనర్చిన పనికి శాపమ్మునందె
కాలిడగ రాక వాలి యాశైలమందు.

అనుచరులగూడి ఋశ్యమూకాద్రికడనె
వాసముండె సుగ్రీవుడు; వాలివలన
భయమెకింతయులే దను భావమొకటి
చిత్తమం దొకపాటి సుస్థిరత నీయ.

భావమునందు నిల్కడయుపట్టదు, కన్నులుమూసినిద్రకున్
బోవడు, తిండియున్ సరిగముట్టడు, మిత్రులపల్కరింప దే
దైవము తానుగానగుచు తారసిలన్‌వలె గాని యింక సు
గ్రీవుని చింత లొక్కకొలికిన్ బడబో వని యెంతు రందఱున్.

వచ్చెనొలేదొ నేడు తనవద్దకు వాయుకుమారు డంతటన్
హెచ్చిన వేదనాభరము నెల్లను లోగుదియించి పూసలన్
గ్రుచ్చినరీతి గాగ తనగోడు సమస్తము సూర్యసూతి వా
క్రుచ్చెను గాలిపట్టికనుకోసలు మెల్లన చెమ్మరింపగన్.

వదలడు సూర్యసూనుని రవంతయు నొంటిగ, వానిచిత్తమున్
చెదరగనీడు, ధైర్యమువచించునుసారెకు వచ్చు వేగమే
సుదినములంచు, తానొకడె శూరత మీఱగ నేగి వాలిపై
గదిసి యడంతు వానిమదకావరమంచును పల్కు హన్మడున్.

వినినకొలది సుగ్రీవుని వెతల నెల్ల
తలచినకొలంది వాలిచేతలను మదిని,
సానుకంపము కోపము స్వాంతమందు
గీలుకొని మారుతియు పిడికిలి బిగించి -

ప్లవ గోత్తంసుని భానుసూనుని మహాప్రజ్ఞాఢ్యునిన్‌సౌమ్యుని
ట్లవమానించిన వాలిపై కరుగ క్రోధావేశ దుర్దాంతద
ర్పవిలా సోద్ధతు డాంజనేయుడు మహోగ్రాకారుడై లేవ క
న్గవసన్నన్ పవమానసూను కినుకన్ వారించి సుగ్రీవుడున్.

ఆగుముమారుతీ! భవదనంతబలోగ్ర సమగ్రసాహసో
ద్వేగము నేనెఱుంగుదును, విన్ము ముఖాముఖిగాగ వాలిపై
కేగుట సాధ్య మెవ్వనికినేనియు గాదు, మరేదొ సాధనన్
కాగలకార్యముల్ జరుపగా దలపోయుట యోగ్యమౌనవన్.

మారుతి కొంతచల్లబడి మానసమం దత డన్నమాటలో
సారమెఱింగి స్వీయజవ సత్త్వపటుత్వ మహత్త్వమెప్పుడే
తీరున సూర్యసూనునికి తృప్తిఘటిల్లగ సాయమౌనొ యం
చారటమొంది వందనము లర్పణసేయును దేవతాలికిన్. 60

మది సుగ్రీవుడుకూడ సంతతము సంభావించు నుద్యద్బలా
స్పదు డీవాయుసుతుండు వీనిప్రతిభాసామర్థ్యముల్ సాయమై
హృదయక్షోభమువాసి జీవనమునం దేకొంతయో శాంతిసం
పద వాసించునె యంచు వేయిగతులన్ బ్రార్థించుచున్ వేల్పులన్.

పావని శంకరాంశవిభవమ్ములు మూర్తినిగొన్న తేజపుం
బ్రోవు, తనంతతాను కొలువుం గొన వచ్చు ముహూర్తమేమొ సు
గ్రీవుడు మోదసంపదురరీకృత సుందరసుస్మితాస్యుడై
భావనసేయు నిద్ధి తనభావిశుభోదయసూచి యట్లుగన్.

ఆశ్వాసాంతము

హనుమంతుడు సుగ్రీవుడు
ఘను లీయిరువురు కలసినకథ నీకరణిన్
వినిపించితి రామచంద్ర
ప్రణుతోజ్జ్వల మధురభావ రసవత్ఫణితిన్.

సురసురేంద్ర సంయమి నమస్యుడవు నీవు
యాగ భోగ విలాస మహోత్కుడవును
సాధు సాంగత్య కౌతుక సరసమతివి
శ్రితజనావన దీక్షితాకృతివి రామ! 64

ఇది శ్రీ హనుమత్ప్రబంధమున సుగ్రీవుని కడకు హనుమంతుని సమాగమము, వాలి సుగ్రీవుల జననము, సుగ్రీవుని ఋశ్యమూక నివాస కథయు గల తృతీయా శ్వాసము.

# శ్రీహనుమత్ప్రబంధము

## చతుర్థాశ్వాసము

శ్రీమునిజనపూజిత పద,
కామిత బహుపుణ్యఫలద, కపికుల వరదా,
భూమీసుతసౌఖ్యాస్పద,
సామిరి మనః ప్రమోద! సత్యవినోదా!

దేవా ! అవధరింపుము

### శ్రీరామావతారము

ఎఱుగగజాల రెవ్వరును సృష్టిరహస్యము లోకవర్తనం
బరుగదు సర్వకాల మొకయధ్వమునం బడి, పాపకర్ముడా
క్రూరుడెవడో సమస్తజనకంటకుడై చెలరేగ, దుస్తరో
ద్ధురదురితవ్యథన్ మునిగి దుఃఖమయమ్మగు లోకమంతయున్.

రావణుడన్న దానవుడు బ్రహ్మకుమన్మడె కాని పాపసం
భావిత దుష్టకార్యవిషవహ్నుల మధ్యగ ముజ్జగమ్ములన్
ప్రోవులుబెట్టు, దర్పపరిపూరిత మృత్యుహసన్నట ద్దశ
గ్రీవుడు నిర్నిమిత్తభయసృష్టికి స్రష్ట యతండు ధారుణిన్.

జనులకునిద్రరాదు, సుఖశాంతులులే విలపైని, స్త్రీలకున్
గనబడ దాత్మరక్ష , సవనాగ్నులువెల్గవు, స్వర్గహీనులై
చని రనిమేషు లావలకు, సర్వజగమ్ములు కంపమొందు నా
దనుజుని నామమాత్రమున ధైర్యము తక్కి శిరమ్ము వాల్చుచున్.

మునులున్దేవతలేగి దైత్యుదురితమ్ముల్జెప్పి దుఃఖింపగా
తనసృష్టించిన లోకముల్ పడెడు బాధల్జూచి యాబ్రహ్మయున్
వనజాక్షుం డొకడే త్రిలోకముల బ్రోవన్గల్గు దైవమ్ముగా
మనమం దెంచుచు దేవతాగణములున్ మౌనీంద్రులున్ వెంటరాన్.

శ్రీరమణీమనోహరుడు ,శేషశయుండు కృపాప్రసన్నరే
ఖారుచిరాబ్జలోచనుడు, కామితదాయి, విపన్నలోకమం
దారుడు, క్రూరదానవవిదారణ దక్షుడు, ధర్మమార్గర
క్షారభమాణశీలుడగు నచ్యుతు ముందునవ్రాలి మ్రొక్కుచున్.

ఉత్పలమాలిక

దేవ! వినంగదయ్యయిటు దీనతనుంటిమి ప్రాణభీతితో
ఏవరసిద్ధియో తనకునిచ్చిన దుర్దమ సాహసోగ్రద
ర్పావహుడై జగమ్ము తనదైన యటుల్ విహరించు క్రూరుడై
రావణుడన్నదైత్యుడు దొరా !అతిదుష్టచరిత్రుడున్ దశ -

గ్రీవుడంతడు చేయు విపరీతము లంతముబొంద వామహోగ్రమా
యావి యొనర్పనట్టి యఘమన్నది లేదు, సురాసురోరగుల్
ప్రోవుగవచ్చి యొక్కపరి పోరి మహాస్త్రచయమ్ము లేసినన్
చావ డతండు, వానివరశక్తియు నట్టిద, అల్పుడంచు దా-

భావనసేయు మానవుడె వానినిబట్టి వధింప వీలగున్
గావున దేవ! మానవునిగా ధర నీవయిపుట్టి రానిచో
భూవలయమ్మెగాదు మఱి మూడుజగమ్ములుగూడ ధ్వంసమౌ;
నీ విలయమ్ము నింక శమియింపగజేయు మటంచు వేడినన్. 10

సరసిజసంభవాదులు నిశాచరు చేష్టలిటుల్ వచింప శ్రీ
హరి యభయమ్మొసంగి కరుణాదరమొప్పగ దేవతాళి వా
నరులయి ధాత్రి నింక జననమ్ములుగాంతురు కార్యమాపయిన్
నెఱపెద మానవాకృతిని నేనని బల్కుచు బంపె వారలన్.

అనిమిషులేగినారు దివిజాధిపు దౌష్ట్యము విన్నవించుచున్
తనపని యొక్కటే మిగిలె ధాత్రిని జన్మముగాంచు, టింతలో
తనయుల కోసమై దశరథక్షితి నేత మహేంద్రమిత్రు డా
యినకుల రాజొనర్చు ఒక యిష్టి కనంబడె శౌరికిమ్ముగా.

కరుణాసింధుడు లోకరక్షణ బృహత్ కార్యైక దీక్షాత్ముం డా
సరసీజాక్షుడు రాముడై దశరథక్ష్మాజానికిన్ బుత్రుడై
ధరజన్మించెను, క్రూరదైత్య దళనోద్యత్కేళిసంరంభ సం
భరితావేశ ప్రరాక్రమప్రకట భాస్వత్కీర్తిమన్మూర్తి యై.

తనయుడు రాముడే దశరథావనిపాలుని కండ్లవెల్గు తత్
ప్రణుతచరిత్రు నింక యువరాజుగ జేయదలంచు రాజవ
ర్యున కొక తీర్పరాని యవరోధము కల్పితమయ్యె నాతడుం
దన చినభార్య కైకకును తానిడె రెండువరాలు పూర్వ మా-

వనితయు కోరె నాదినమె వానిని పంతము బట్టి రామునిన్
వనులవసింప బంపి పదునాలుగు వత్సరముల్, మహీశుగా
తనసుతునే యొనర్పవలె తప్పదనంగ నృపాలమౌళి కై
క నుడివినట్టి కోరికల కాదనలేక శిరమ్ము వాలిచెన్.

అనిమిషకార్యమున్ జనకునానతి రెండునుగూడ కూడివ
చ్చినపరమార్థమై వెడలె శ్రీరఘురాము డరణ్యసీమకున్
మునిజనవేషధారియు అమోఘధనుర్మహితాస్త్రధారియై
తనసతిసీతతో నసుగుదమ్ముడు లక్ష్మణమూర్తి తోడుగన్.

ఆయతశక్తిపూర్ణ వివిధాస్త్రమహోమహితుండు వీరనా
రాయణవిక్రమప్రభువు రాము డజేయ పరాక్రమక్రమ
స్థేయుడు; గాధిమౌని క్రతుదీక్షలగాచెను బాల్యమందె దై
తేయుల గీటడంచి నిటలేక్షణుచాపము బాహుదర్పధౌ-

రేయతమీఱ నెక్కిడి ధరిత్రిజసీతనుబెండ్లియాడె; గా
ధేయఋషీంద్రు డిచ్చిన యుదీర్ణమహాస్త్ర , బలాబలాది వి
ద్యాయుతు డుర్విపై మనుజుడై యుదయించిన విష్ణు వాజగ
ద్గేయునిపైన యున్నది క్షితిన్ దితి జోద్ధతి నుండి బ్రోవగా.

## శ్రీరాముని వనవాసము

ఆ దశకంఠకంఠదళనాకృతి రాముడు కాననసీమ కేగెడున్
మేదినికిన్ దివమ్మునకు మేలగుకాలము వచ్చెనంచు స
మ్మోదభరాత్ములై త్రిదివముఖ్యులు పల్కిరి హర్షదీపితా
స్యాదర రమ్యభావ విజయాశిషముల్ విను వీధినుండియే.

మునికులరక్షకుండు గుణపూజ్యుడు ధర్మనిబద్ధబుద్ధియున్
దనుజదురాగతోన్మథన దక్షుడు శ్రీ రఘురామమూర్తియున్
వనముల కేగుదెంచె నను వార్త నిమేషమునంద వ్యాప్తమై
దనుజులకున్ భయప్రదము తాపసమోదము నై విరాజిలెన్. 20

రాముడు సత్కృపాసుగుణ రాజితశీలుడు బంధురాటవీ
సీమల దవ్వుదవ్వులకు చేరిన యాదినమందె ''దేవ! మ
మ్మోమగ వచ్చినావిట కహో! రఘుపుంగవ! వేయికండ్లతో
నీమెయి వేచియుంటిమిటనే భవదాగమనాభిలాషలన్''.

అనుచున్ రామునిచుట్టుజేరి మునులాయాచోటులన్ దుఃఖితా
ననులై ''రామనరేంద్ర! దైత్యులుమమున్ నానావిధక్రూరవే
దనలన్ బెట్టుచు సాగనీయరు తపోధ్యానమ్ములన్ నిద్రకై
నను సంపూర్తిగ నోచుకోముగద ఎన్నండేని కన్మోయికిన్.

మాయావుల్‌ప్రభు! వారలీదితిజ దుర్మార్గాటవీసీమకున్
నీయర్ధాంగిని కూడ దెచ్చితివికన్ నీతోడ, ఈత్రోవలం
దేయన్యాయముకైన నోడరు సుమీ! ఈదానవానీక మా
మాయాజాలము లెట్టు లీగగలవో, మమ్మెట్లు గాపాడెదో.

కామమదోగ్రవర్తను లకారణ వైరులు దాన వోత్కరం
బే మెటకేని పోవగల మీసుకుమారిని గాచుకొమ్ము; శ్రీ
రామ! యటన్నమాటలతెఱం గొకభీతిగ సీతమోముపై
బ్రామిన జూచి యాభయము బాపగ రాముడు మందహాసుడై.

ధరణీజాతకరాంబుజమ్ము నిజహస్తమ్మందు గీలించి, ఈ
ధరపై దైత్యులయాట సాగదిటుపై ధైర్యమ్ముతోనుండు డీ
వెఱవంబోకు డటంచు మౌనితతికిన్ వీడ్కోల్పులన్ బల్కి తా
నరిగెన్ పంచవటీప్రశాంత విపిన ప్రాంతమ్ము లందుంటకై.

యతుల కొసంగినట్టి యభయమ్మును నెమ్మదినుంచి పావసం
గత బహుళప్రమాదకర కర్మరులన్ ఖరదూషణాది దు
ర్మతుల వధించె నొంటరిగ రాముడు షష్టిసహస్ర రాక్షస
ప్రతతిని క్రూరబాణవిసర ప్రవిదారణ వహ్నికీలలన్.

రామునియందముం గనిన రావణుసోదరి చుప్పనాకయున్
రామునిపైకి కామగతరాగమునన్ జనుదేర లక్ష్మణుం
డామెను ముక్కుగోసి వెలికంపగ నామెయు సీతయందమున్
రాముని చేష్ట లీర్ష్యమెయి రావణునిన్ బురికొల్పి చెప్పగా.

భూమిపయిన్ దినేశకుల భూషణు డాహవ సాహసోగ్రుడా
రాముడు సర్వరాక్షసవిరాము డికన్, భువనైకసుందర
శ్రీ మహిళాశిరోమణికిరీటము సీతయు,నన్న వార్తలా
కామదురాగతుండు దశకంఠుని యీర్ష్యకు గారణమ్ములై.

దానవదౌష్ట్య సంహర దుదాత్తధనుష్కులు రామలక్ష్మణుల్
లేనితఱిన్ మదోత్కట మలీమసచిత్తుడు మౌనివేషముం
బూనిన వంచనాత్ముడయి భూమిజనెత్తుకపోయి లంకలో
దానవనేత రావణుడు దాచె నిశాట వధూజనమధ్యమందునన్.

పంచవటీకుటీరముల పంచల సీతనుగాన కక్కటా
వంచకు లా నిశాచరుల బారికి పాల్పడి పోతి; నన్మదా
శాంచిత దీపమాయతివ నా దితిజాధము లేమిచేసిరో
యంచు వనమ్ములన్ వెదకె నారఘురాముడు దుఃఖితాత్ముడై. 30

సీతాపహరణము

జిలుగుపైడి మెఱుంగు చిన్నారిలేడి
కులుకునడల తమకుటికి వచ్చుటయు
ధరణిజ కోరగా దానికైతాను
పరువెత్తి తిరిగియు పట్టగ లేక-

వేసారి బాణమ్ము వేసినంతటనె
'హాసీత' యనిలేడి యసురుడై పడుచు
తనమాటగా నార్వ ధరణిజ వెఱచి
అనుజు లక్ష్మణునంపె నంతలో వెనుక-

కరుదెంచి కనుగొన నవనిజలేదు;
ఎఱుగరా దిదియెల్ల ఏదైత్యుపనియొ;
తనబహిఃప్రాణమ్ము ధరణిజలేదు
తన శక్తియేమయ్యె దనుజాముందనుచు-

పలవించి సీతకై వనులెల్ల వెదుక
కలగిన గుండెతో కదలె రాఘవుడు;
తాపమ్ము కోపమ్ము తనపౌరుషమ్ము
దీపించు నొక భావ తీవ్రత మెఱయ.

జానకి గొంచుబోయెడి నిశాచరునాపి జటాయుపక్షి యా
దానవుఖడ్గసంహతికి ధారుణి గూలియు, బిగ్గబట్టి ప్రా
ణానిలముల్ రఘూత్తముని కావసుధాత్మజవార్త జెప్పి తా
బ్రాణమువాసె నచ్చట మహాత్ములవర్తన లిట్టి వేకదా.

ఆజటాయువు దశరథు నాప్తసఖుడు
నేడు సీతకై ప్రాణమున్ వీడెనిట్లు
ప్రీతిమెయి పక్షి కంత్యసంస్కృతుల విధులు
సలిపి రాముడున్ దనకృతజ్ఞతల దెలిపె.

ఉర్విజకోసమై వెదకుచున్న రఘూత్తము చేతగూలి గం
ధర్వుని రూపముంగొనిన దైత్యుడొకండు కబంధుడన్నవా
డుర్విజ గొంచు దైత్యకులు డొక్కడు వైళమ దక్షిణాశకుం
బర్విడి పోవుచుండె నని వాకొని రామునికాళ్ళ మ్రొక్కుచున్ -

నాశాపమ్మును దీర్చినాడవు ప్రభూ! నామాటగా వేగమే
ఈసామీప్యమునందె పంపకును మీరేగుండు తద్వాటికన్
కీశాధ్యక్షుడొకండు స్నేహితుని భంగిన్ మీకు దోడౌనటం
చాశన్ జూపగ రాముడేగె తదరణ్యప్రాంతమార్గమ్ములన్.

ఏతొలినాళ్ళ పుణ్యఫల మీవసుధాత్మజ నాకుదక్కనే
నాతనువుండగా నని మనమ్మున గాసిలు రామునాత్మయం
దాతడెవండొ యాదివిజు డాడిన పల్కులు క్రొత్తవెల్గులై
చేతమునందు ధైర్య మొకచిన్నము నిల్పినయట్లు తోచుచున్.

వికచసరోజరమ్యముఖి పృథ్విజ కన్పడునన్న యాసతో
ఒకపరి యుత్సుకత్వమున నూహలుసేయు, మఱొక్కలిప్తలో
చకితమనస్కుడై బ్రతుకుసర్వము శూన్యముగా దలంచుచున్
ప్రకటవియోగదుర్భరవిపన్నమతియై విలపించురాముడున్. 40

సలలిత సాధుమూర్తి విలసన్మృదుభాషిణి సీతరూపమున్
దలచుకొలంది రామునకెదన్ తరుణీవిరహార్తి భార మ
గ్గలమయి వెంటనే దితిజకాండముపై నది కోపహేతువై
కలగినగుండెలో ధృతినిగానడు లక్ష్మణు డూరడించినన్.

సీతకు నై మదిన్ విరహచింతయు, దుష్టనిశాటుమోసపుం
జేతకునై మహాగ్రహము, శ్రీరఘురాముని సర్వమున్ మహో
గ్రాతత వాయువేగ పరికంపిత పాదపమట్లొనర్ప శో
కాతురుడై యతండు చను నావనిలో ననుజుండు వెంటరాన్.

వనములబట్టి యట్లరుగువానిని రాముని జూచి సమ్మదా
స్యనిభృతదీప్తితో శబరియన్న తపస్విని స్వీయసత్తపో
వినుతకుటీరభూమికిని వేగమె తాగొనిపోయి భక్తిమ
ద్వినయమునన్ పదశ్రమము దీరగ జేసె సపర్యలాదృతిన్

శబరిపరిచర్య

సలలిత వాహినీ విమలసారజలమ్ముల పండుటాకుడొ
ప్పుల గొనివచ్చి యిచ్చి రసబంధురముల్ పరిపక్వసత్ఫల
మ్ములు పువుదేనె సోనలును ముందుగబెట్టి తనంత దగ్గఱన్
నిలబడు వారలున్ కడుపు నిండుగ తృప్తిగ తిన్న దన్కనున్.

అదె కనుగొండు మద్గురువు నాశ్రమశైలము, నాతపోగృహ
మ్మిది, సెలయేటినీరమదె మెల్లగ సాగుచునున్న దీతటిన్
మధురఫలోర్విజమ్ములవె, మంజులపుష్పము లివ్వియున్, వినుం
డిదె పికగానమంచు వచియించుచు చూపును వారి కామెయున్.

గడియ లొక్కటొక్కటియును గడచుకొలది
దినము లనుకూల మగుచున్న వనినయూహ
రామునకుగల్గి శబరియాశ్రమమునందు
మదిని యుల్లాసమెక్కింత పొదలసాగె.

పరమతపోవిధిన్ బ్రతుకుపండిన పుణ్యచరిత్ర యామె ఆ
నరవర సూనులిట్టుల వనాధ్వములంబడి వచ్చు కారణ
మ్మరసి సమీపపంపకు రయమ్మున పోగల దారి జెప్పి యా
దర మృదులోక్తి సంగత విధమ్మున బల్కెనువీడుకొల్పులన్.

ఆగంధర్వుడు, ఈతపస్వినియు ఏయధ్వమ్ములంజూపి రం
దేగంజొచ్చిరి రామలక్ష్మణు లొగిన్ పృథ్వీసుతాన్వేషణో
ద్యోగవ్యగ్రులు పంపవైపునకు; కీశోత్తంసు డాపుణ్యు డె
చ్చోగన్పట్టునొ యన్న సందియములం దూగాడు చిత్తమ్ములన్.

కానన మింతపల్చబడి కానగనయ్యెను చూపుమేర నే
దోనగ, మాయుపాంతములనుండియె వారికణార్ద్రశీతమం
దానిల మేచి వారలయెదల్ కదలించిన దౌక్కనూత్నహ
ర్షానుభవమ్ము సముదంచిత కౌతుక పూర్ణ హేతువై.

యతి మతంగుని ఋశ్యమూకాద్రి యద్ది
అర్కజుడు తలదాచుకొన్నట్టి చోటు
అచటి పంపాసర శ్శీతలానిలములు
వికల మానసోపశమన విలసనములు. 50

కవి.రా.వి.

కొలనున నల్లడ గూర్చివ పంక్తులు క్రౌంజిగురాకుల కుంజములన్
జలముల పై బడి చల్లగ సాగుచు జల్లుల నింపెడి తుంపురులున్
పులుగులపాటలు పూబొదరిండులు పొలుపగు తీయనితావులునున్
గలగల మనుచున్ కమ్మగవీచెడి గాలులకున్ కడుతావలమై.

స్వాగత :

చారుదృశ్యములు చల్లని పంపా
తీరభాగములు దీపితపుష్పో
దారవాసములు తన్పెను రామున్
భూరిశాంతిపరిపూర్ణములౌచున్.

చూచితె లక్ష్మణా యిచట శోభిలు వృక్షచయమ్ము లింపుగా
పూచిన పూవులౌచు మధువుల్ చిలికెంచెడు పండ్ల గుత్తులై
తోచుచు వానరాళికిని తోషము గూర్చు నివాసముల్ శుభ
శ్రీ చెలువారుచున్న వని చెప్పుచు ముందున కేగె రాముడున్.

హనుమంతునకు శ్రీరామదర్శనము

ఋశ్యమూకాద్రినుండి సుగ్రీవు డంత
రమ్య పంపాసరోవ రారామ సీమ
సంచరించుచు నున్న తేజః ప్రపూర్ణ
మహితమూర్తుల రామలక్ష్మణుల జూచి.

విస్మయము భ్రాంతియును మనోవీధి గదుర
చూచుచున్నట్టి వారినే చూచి మరల
ఏదియును మానసమున నూహింపలేక
సరసనున్న హన్మంతు జేసన్న బిలిచి.

ఆదెస చూడు మోహనుమ ఆవనవీధుల నిర్వురెవ్వరో
మేదురతైజసాకృతు లమేయబలాఢ్యులు చాపధారులై
ఈదరి కేగుదెంచునటులే కనుపించెడి నీవనమ్మునం
దీదృశు లెవ్వరీయెడ చరించిన జాడయులేదు నేటికిన్.

పాలితదుర్ణయుండు మనవాలియు ఎంతకులేడు నెమ్మదిన్
జాలియొకింతలేని యొకజాల్ముడు తానయిరానులేక ఈ
శైలముమీదికిన్ ప్రబలచండధనుష్కులు వీరినిట్లు నా
పాలిటి మృత్యుమూర్తులుగ ప్రాణముదీయగ పంపియుండునా !

చూడంజూడగ భీతియేదియొ మదిన్ చూడించుచుండెన్ బల
వ్యూఢోరస్కు లుషర్బుధాకృతులు సంపూర్ణప్రభావుల్ జటా
చూడాలంకృత భాసురాస్యులు మహోశూరోగ్రధానుష్కు లే
నా డీ ధీరపరాక్రమాన్వితుల కానన్‌లేదు నాజన్మకున్.

నామాటన్ విని వేగపోయి మతిమంతా ! దుర్నిరీక్ష్యాగ్నిరే
ఖామార్తాండులు వీరలెవ్వ రిక యేకార్యార్థులై యిట్లు పం
పామార్గంబుల బట్టి వచ్చెదరో యావార్తన్ సమస్తమ్మునీ
సామర్థ్యమ్మును జూపి తెచ్చుదనుకన్ శాంతమ్ములే దీయెదన్.

అను సుగ్రీవుని వాక్యపద్ధతుల తానాలించి సామీరి నీ
వనుమానమ్ము కొలంది బీతువడెదేలా యిట్లు కీశేశ ! స
ద్గుణ మూర్తిద్వయ మట్లె వారలును నాకున్ దోచుచున్నారు నే
చని కన్గొందు నటంచు ధైర్యమును నచ్చంజెప్పి తానొక్కడున్. 60

వినయవిధేయుడైన ఒకభిక్షుకరూపము దాల్చి వేగమా
మునిజనవేషభూషితులు మోహనమూర్తులు నైన రామల
క్ష్మణులు చరించుచున్న వనమార్గము ప్రక్కలకేగి చెట్ల సం
దున నిముసమ్ము నిల్చి కనుదోయికి విందుగ జూచె నిర్వురిన్.

ఒకడు వినీల వార్షుక పయోదతనూ సుషమాభిరాము, డిం
కొకడు సువర్ణసుందర తనూజ్జ్వల కాంతిమయూఖు డిర్వురున్
ప్రకటతర ప్రచండధనురంకిత బాహుబలప్రదీపితుల్
అకలుష సుప్రసన్నవదనాంబుజ కాంతిమనోజ్ఞ విగ్రహుల్.

సారవివేక భావుకుడు సాంజలియై పవమానసూను డా
వీరులు వచ్చి నిల్చిన వివిక్తవిశాలవనప్రదేశముం
జేరినయంత వారిముఖసీమలయం దొకదైన్యరేఖ వి
స్ఫారినరీతి జూచి పలుకాడె నిటుల్ వినయానతాస్యుడై.

ఎవరయ్యా మహనీయు లిర్వురును మీరీ పుణ్యపంపాతటీ
వివిధప్రాంతములందు నెవ్వరినో యన్వేషించుచున్నట్లుగా
నవలోకించుచు వత్తురిందనుక నీయధ్వమ్ములం దేను మి
మ్ము విలోకింపను లేదు కైకొనుడు మత్ప్రాజానమస్కారముల్.

శ్రీ కల్యాణమనోజ్ఞలాంఛనులు రాశీభూతసౌందర్యరే
ఖాకూపారులు రాజశేఖరు లుదగ్రస్ఫారధానుష్క వి
ద్యాకారుల్ మఱి మీరుమౌనులయి వన్యాధ్వమ్ములం దిట్టు లే
దోకార్యార్థము వచ్చుచున్నటుల నాయుల్లమ్మునన్ గన్పడున్.

మీతారుణ్యతనూ విలాసరుచు లున్మేషప్రభావంబులై
యాతీరమ్ములనెల్ల నూతనకళాహేలావిశేషోదయ
శ్రీతారమ్ముల జేయుచున్న యవి మీరీకాననమ్మెల్ల సం
పూతమ్ముం బొనరింప వచ్చిన జగత్ప్రాజ్యాకృతుల్ కావలెన్.

శూరతమీఱ దర్పములజూపి త్రి లోకములెత్తివచ్చినన్
క్రూరధనుర్విముక్తశరకోటులకున్ బలిజేయజాలు వి
స్తారపరాక్రమోగ్రబలశాసను లూర్జితశౌర్యవిస్ఫుర
ద్వీరులు మీరలెవ్వరొ త్రివిక్రమసత్వ సమగ్రవిగ్రహుల్.

మఱియున్ సర్వదిశాభిరక్షణకళా మాహాత్మ్య సూచీవిని
ర్భర ధర్మాకృతు లాగ మాంత విషయప్రజ్ఞానమున్మేషవి
స్ఫురదాకారముమీది నాదుహృదయమ్మున్ ముట్టి మెచ్చించు నే
నెఱుగన్ వచ్చునె మీరలెవ్వరొమహిన్ విజ్ఞానదీపద్యుతుల్.

పావనమున్ ప్రభుత్వ విభవప్రథమానము మీదుదర్శనం
బీవనసీమ కెల్లను లభించిన యీయమృతక్షణమ్మె నా
జీవనమెల్ల మీచరణసేవల కంకితమైన దంచు నా
పావని వారిపాదముల వ్రాలెను స్వీయవనేచరాకృతిన్.

నావిషయమ్ము జెప్పెద వినందగుకొంత మహాత్ములార సం
భావితసచ్చరిత్రుడగు వాయుకుమారుడ ఆంజనేయుడన్
పావనజీవనుం డఖిల వానరవంశ వివర్ధనుండు సు
గ్రీవుని మంత్రినై యిటచరింతును పిన్నతనమ్మునుండియున్. 70

అనిమిషనాథుని వజ్ర
మ్మున నాచెక్కిలిని దెబ్బపొడమిన కతనన్
హనుమంతుడ; అంజననా
జననియు, దిననాథుకడన చదివితిశ్రుతులన్.

ఆసుగ్రీవుడు సర్వధర్మనియమాభ్యాసుండు దోర్దర్పరే
ఖాసర్వస్వుడు, స్నేహపాత్రు డత డర్కస్వామి పుత్రుం డెదన్
మీసఖ్యమ్మునుగోరి నన్నిటకు బంపెన్ మిమ్ముతోడ్తేరవి
శ్వాసార్హుం డెదియేని మేలునొనరింపన్ శక్తిమంతు ండగున్.

ఐనను వానికిం గలిగె నాపదయొక్కటి అన్నవాలిచే
మానిని గోలుపోయి అవమానముపాలయి ఒంటివాడుగా
ఈనగకందరమ్ముల వసించుచునుండె మహాబలాఢ్యుడా
వానరరాజు వాలియును వైరముమానడు భానుసూతిపై.

కపికులీనుడ నేనును కామరూపి
నగుదు, వచ్చినానిచ్చటి కర్కునాజ్ఞ
ననుచు భక్తిమై రామలక్ష్మణుల కెరగె
మరల లలితమర్యాదు డామారుతియును.

హనుమదృష్టి రఘుస్వామి యంఘ్రులందె
రాముకన్దోయి పావనిమోమునందె
వారుకలిసిన నిముషప్రభావమేమొ
ప్రబలె నన్యోన్యగౌరవభావ మొకటి.

హనుమ డారీతి పలుకుచు న్నంత సేపు
శ్రీరఘూత్తము మోము సుస్మేరరుచిమ
నోజ్ఞ మగుటయు లక్ష్మణుం డును గ్రహించె;
అపుడు శ్రీరామమూర్తియు ననుజుజూచి.

విదితమె లక్ష్మణా! యితడు విన్చిన పల్కులి వెల్లనున్ సుధా
మధురము లెంతవిజ్ఞతయు మాన్యతయున్ ప్రసన్నతా
స్పదములునై కనంబడునొ వ్యాకృతియున్ చెడదన్న మాటలన్
మదిని గ్రహించి లక్ష్మణుడు మారుతికిట్లను సౌమ్యవాక్కులన్.

వినుమోయీ కపివర్యనీమ్మృదువచోవిన్యాస మాలించి మా
మనముల్ తృప్తివహించె, పూజ్యుడితడౌ మాయన్న రాముండు ధ
ర్మనిబద్ధాత్ముడు సత్యసంధుడు జగన్మాన్యైకవీరుండు ల
క్ష్మణుడన్ నేను మహాత్ము డాదశరథక్ష్మాజాని మాతండ్రి; యా-

తని యాజ్ఞందలదాల్చి భార్యయగు సీతాదేవితో రాము డీ
వనులన్ పంచవటీవనాంతరకుటీవాసమ్ము నందుండగా
దనుజుండొక్కడు మేము లేనితరి సీతన్ బల్మిచేబట్టి ద
క్షిణదేశమ్మున కేగెనంచు వినివచ్చెన్ రాముడిచ్చోటికిన్.

వనితారత్నము నట్లు గోలుపడి దుర్వార వ్యధాభుగ్నచే
తను డీ రాముడు జానకిన్ వెదకు యత్నమ్మందు గాంక్షించు మీ
రొనరింపంగల సాయ మా ప్లవగ యూధోత్తంసు చూడన్ మమున్
గొని పొమ్మంచు వచించు లక్ష్మణుని వాక్కుల్ విన్న సామీరికిన్. 80

శ్రీ వికసన్నవాబ్జ మను రీతి వెలింగినదాననమ్ము; సు
గ్రీవుని బాధలుందొలగు శ్రీరఘురామునిజేరు సీత దై
త్యావళి పీడలున్ సురుగు నన్న ప్రియప్రదమైదలిర్చుస
ద్భావము మోమునందలరె భవ్యమహోల్లసనార్ద్రరేఖగా.

హనుమ వేగమె రామలక్ష్మణుల జూచి
ప్రీతి గొనిపోదు మిమ్ము సుగ్రీవుకడకు
అధివసింపుడు మీరిందు ననుచుజూపె
విపులతలములు నిజభుజాపీఠములను.

స్మేరవదనులు రామసౌమిత్రు లెలమి
హనుమని భుజాగ్రతలములం దలరిరపుడు
కనకభూధర సానుభాగములయందు
విరియబూచినట్టి శిరీషతరువు లట్లు.

శ్రమయొకింత లేకయె భుజాస్కంధమందు
తమ్ముగొనిపోవు మారుతితనయు జూచి
ఎంతటికి నైన తగును హన్మంతు డనుచు
రాము డెద దలంచిన ముహూర్తమ్ములోనె.

ప్రహర్షిణి

వైకుంఠుంగొని చను వైనతేయు రీతిన్
రాకాచంద్రముఖుడు రామచంద్రు తోడన్
వీకన్ జేరె హనుమ వేగితాచ్ఛవిద్యుత్
శ్రీకుం డను నట్లుగ ఋశ్యమూక సీమన్.

పరమోదాత్త తనూబలప్రకట భాస్వత్కాంతిమాలాధురం
ధరు లాధీరుల నిర్వురిన్ తనభుజాదార్ఢ్యంబు నందంజనా
వరపుత్రుండటు తోడితెచ్చుటయు విస్పష్టమ్ముగా దూరమం
దరయంగల్గి యొకింత నెమ్మదిని ధైర్యంబూనె సుగ్రీవుడున్.

కనుగవ కామహోప్రబలకార్ముకధారులు దైవమూర్తులై
కనబడి వానరాధిపుని కార్యముసైతము సానుకూలమై
తనరును తథ్యమం చతులితప్రమదార్ద్ర ముఖారవిందుడై
హనుమడు రామలక్ష్మణుల నాకపినాయకుముందు దింపగా.

మునిజనవేషులయ్యు పరిపూర్ణమనోహరరాజపుత్రల
క్షణులు మహోజ్జ్వలాకృతులు చండధనుర్ధరవీరనాయకా
గ్రణులగు వారికిర్వురకు కైజతమోడిచె భానుసూనుడా
ఘను లెవ రిట్లు వచ్చుటకు కారణమేమొ యెఱుంగకుండనే.

తోచి ప్రభాకరచ్ఛటలు తోరములై, మృదుమారుతోర్మికల్
వీచి, విహంగగానములు విచ్చడి పుష్పసుగంధసౌరభ
మ్మేచి, సమస్తమాపృథుమహీధరభూమి శుభప్రమోదసం
సూచికగా కనంబడుచు శోభిలె వారల కాక్షణమ్మునన్.

ఆశ్వాసాంతము

ఇనునిసుతుడు సుగ్రీవుం
డినకుల తిలకుండవీవు ఇనుశిష్యుండా
హనుమయు ముప్పురు కలసిన
వినుతచరిత్రమ్ము దీని విన్పితి రామా! 90

శాశ్వతానందభావ ప్రశస్తమూర్తి!
రాజితాఖిలసద్గుణ రమ్యకీర్తి!
మౌనిమానస విమలసద్మప్రవర్తి!
ప్రథితకారుణ్యసాంద్ర శ్రీరామచంద్ర!

ఇది శ్రీ హనుమత్ప్రబంధము నందు శ్రీ రాముని వనవాసము సీతాపహరణము హనుమంతునికి శ్రీరామ దర్శనము రామ లక్ష్మణులను హనుమంతుడు సుగ్రీవుని కడకు కొని పోవుట అనుకథలుగల చతుర్థాశ్వాసము.

# శ్రీ హనుమత్ప్రబంధము

పంచమా శ్వాసము

శ్రీ నారీ హృదయ వాస,
వానర మైత్రీ విలాస, భాసుర హాసా
దానవదళనాభ్యాసా,
భానుకులోత్తంస రామభద్రనరేశా !

దేవా ! అవధరింపుము.

శ్రీరామ సుగ్రీవుల మైత్రి

తానుతోడ్కొని వచ్చిన వారెట్టి వారో యెఱుగ గోరు సుగ్రీవుని ఆత్రత గ్రహించిన ఆంజనేయుడు ముకుళిత కరకమలుండై మున్ముం దారామలక్ష్మణుల చరణములకు మ్రొక్కి సుగ్రీవున కిట్లు విన్నవించె.

ధారుణి నొక్కముల్కిమొనతాకున వ్రీల్చ సమర్థులౌ ధను
ర్ధీరులు కోసలేశ్వరునిబిడ్డలు వీరలు రామలక్ష్మణుల్
ధీరవరేణ్యు లార్యగుణధీవరు లూర్జితపుణ్యభావుకుల్
వీరరుదెంచి రీవిపినవీధుల వెంబడినీదుచెల్మికై.

ధరణిపతిత్వమున్ వదలి తండ్రియనుజ్ఞ నరణ్యసీమలం
దిరుగగ రాముడీతడు సతీమణితో ననుజన్ముతోడుతన్
తిరముగ తానుపంచవటితీరమునన్ వసియించుచుండ వీ
రిరువురులేనివేళ గమనించుచు రామునిభార్యజానకిన్ -

దురితుడు రావణాసురుడు దోర్బలవృత్తిని దొంగిలించి త
త్తరమున దక్షిణాపథముదారుల బోవుటెఱింగి వీరలీ
తెరువులు చూచుకొంచు నరుదెంచిరి సీతగవేషణార్థ మె
వ్వరు తమకున్ సహాయమగువారలో యన్న మనోభిలాషతో.

ఎచ్చట దాచెనో వనిత నేమియొనర్చెనో దానవుండటం
చిచ్చట నచ్చటన్ దిరుగు చీదెసవెంబడి యీసహోదరుల్
గ్రచ్చర వచ్చి రీవెదకుకార్యమునందున నీదుస్నేహమం
దిచ్చయుగూడ చాలకల దీపయి నీయది భారమంచనన్.

ఒక యాశామృదువల్లియున్ మొగమునం దూగాడ శ్రద్ధాళువై
సకలప్రౌఢభుజాపరాక్రమకళల్ స్వామిత్వచిహ్నమ్ములై
యకలంకమ్ముగ బొల్చు సోదరుల నత్యాసక్తితోజూచి యు
త్సుకులై వారు వినంగ పల్కెనిటులన్ సుగ్రీవు డుద్గ్రీవుడై.

శ్రీ రాజన్య మనోజ్ఞలాంఛన రుచిస్నిగ్ధాస్య లిచ్ఛోటికిన్
మీరైవచ్చిరి నాదుసఖ్యమును కూర్మింగోరి ఈస్నేహభా
వారంభప్రథమాన మీనిముస మాహ్లాదైకపారంపరీ
పారమ్యమ్మయి పొల్చుగాత మనకున్ ప్రాంచత్శుభోదర్కమై.

ఓయిమహాప్రభూ రఘుకులోద్వహా! ప్రాణములున్ననాళు లా
ప్యాయతతోడ మిత్రుడనయీ ! యిటు నీకిదె సాచుచుంటి నా
చేయి యనంగ రాముడును చిర్నగ వొప్పగ తానుకూడ న
ట్లేయని చేయిసాచుచు కపీంద్రుని కౌగిలిబూనె ప్రీతితో.

భానుకుమారు డొక్కరుడు భానుకులాగ్రణి యొక్క డిట్లు స్నే
హానుగతాత్ములై వెలయు టారసి భానునిధాత్రు డా హనూ
మానుడు హర్షబాష్పకణమంజుముఖుండయి వెల్గె నింతలో
భానుని రమ్యకాంతులు నభస్థలినిండె శుభాశిషమ్ములై.

ప్రమాణి

సమీరసూను డగ్నివా
రిమధ్యవెల్గజేయగా,
సమంచిత ప్రదక్షిణల్
నమస్కృతుల్ పొనర్చుచున్,

సమీహి తార్ధు లౌచు వా
రిమిత్రతన్ మఱొక్కమా
రమోఘరీతి పల్కి ర
గ్నిముందు రామవానరుల్.

హనుమడు తెచ్చినట్టి తలిరాకుల నారఘురామమూర్తి కా
సనమిడి భానుసూతి నయసంభృత వాక్యవిలాస మొప్ప ఓ
యినకులరత్న నీవిషయమెల్లను వాయుసుతుండు జెప్పె నీ
జనకజగూర్చి మానుము విచారము నాయది భార మీపయిన్.

లావుంజేవయు గల్గి యోధులగుగోలాంగూల వీరాగ్రణుల్
నావద్దం గల రెన్నొలక్షలుగ కొండల్ పెల్లగింపంగ, పా
రావారమ్ముల నైన లంఘనమొనర్పన్ నేర్పరుల్; రావణుం
డేవార్ధిన్ దల దాచుకొన్ననుసరే యిచ్చోటికిన్ దెత్తురున్.

కోతులటంచు నీమదిని గొంకకు రామ ! పరాక్రమోగ్రవి
ద్యోతిత కామరూప మహితుల్ బలధూర్వహు లెల్ల రిందు, ఈ
యాతతఫాలనేత్రనిభు డాహవభీకరు డంజనాసుతుం
డీతడొకండె చాలు దనుజేంద్రుని పాలికి మృత్యురూపమౌ. 10

పనిచెద నాల్గుదిక్కులకు వారిని, సీతనుడాచి దైత్యుడెం
దునిచినగాని ఒక్కనెలలో గనివత్తురు నాదునాజ్ఞగా;
జనకజ గానకున్నెడ నిశాటుని రాజ్యము నెల్ల దెచ్చి నీ
కనుగవముందు బెట్టెదరికన్ ముడిపెట్టిన చాపమట్టుగా.

విను మొకచిత్రమ్మును నే
గనినది వచియింతు నిచట కపిబలగము నే
నును గూడియుండ మామ
ధ్యను సంఘటిలిన దది కడునాకస్మికమై.

ఒకనా డాకసమందు బల్మిమెయి దైత్యుండొక్క డీదిక్కుగా
నొకవామాక్షిని గొంచుబోవు నపు డీయుర్వీస్థలిన్ జార్చె నా
యకయున్ నూపురభూషణమ్ము లివి రామా!యంచు వాక్రుచ్చి, జా
నకిపై యుండును చూడుమం చినసుతుం డామూట ముందుంచగా.

వనచరముఖ్యు డాపగిది పల్కిన దెల్ల మహోత్సుకమ్మునన్
వినుచు దలూపుచున్న రఘువీరునికన్నులు చెమ్మగిల్లె నా
కనుగవముందునున్న కనకాభరణమ్ములు నిశ్చయమ్ముగా
జనకజవై కనంబడి విచారభరమ్ము మనమ్ము నేచగా.

చేతులబట్టి, గుండియలజేరిచి యానగలెల్ల రాముడా
సీతను జూచినట్లె తనచిత్తమునన్ దలపోసికొంచు ని
శ్చేతనుడయ్యు దుఃఖమొకచిన్నము తగ్గిన కాలమందు సం
ప్రీతిగ భానుసూనుపయి దృష్టిమరల్చగ నాకపీంద్రుడున్.

వలదయ్యా జనకజకై
కలతయు నీకిక, నిచటన గల కపిసైన్యం
బిలయెల్ల వెదకి సీతా
నలినాక్షిం గనియెద రిది నమ్ముము రామా.

అనియింకను శ్రీరాముని సుగ్రీవు డూరడించుచు నొకలిప్తమాత్ర మేదో
యాలోచించుచు మిన్నకుండు నంతలో

హనుమ కాత్మలో నేమి తోచినదొ గాని
ప్రాంజలియయి సీతాభూషణాళి కెఱగి
వినతుడై నిల్చి కనుల నీర్వెట్టసాగె
నది కనుంగొని రాముని యెద ద్రవించె.

రామచంద్రుని దిక్కు మొగంబై సుగ్రీవుడుమరల

కలదొకమాట రామ! ననుగాసిలిబెట్టుచు, వాయుసూనుడే
కొలదియొ చెప్పియుండు ననుకొందును, నీకది, వీడ నట్టి కొం
దల మిది నాకు నీవువినదగ్గది కూడను నేను నీవలెన్
లలనను గోలుపోయి వెతలంబడి యుంటిని ఒంటిగా నిటన్. 20

వాలివధ

అదె కిష్కింధను చూడు మచ్చటనె కొల్వైయుండు మాయన్న వా
లి దయాహీనుడు కామలోభుడు ననున్ లేశమ్ముగైకోక నా
ముదితన్ బల్మినిగొంచు నన్ బయటికిన్ పోద్రోలె, దుర్వారదు
ర్మదు డాక్రూరు నెడందలో దలచు మాత్రన్ నేనుభీతిల్లుదున్.

వాలియనన్ మహాబలుడు వాసవపుత్రు డవార్యవిక్రముం
డాలమునందు డీల్పఱచె హైహయుడైన సహస్రబాహునిన్;
వాలమునందు రావణునిబట్టి పదింబది ముంచితెల్చె నీ
నాలుగువార్ధులందు ననినన్ విని రాముడొకింత నవ్వుచున్.

భయమున్ మానుము మిత్ర! శంకవలదున్ భావమ్మునందింక దు
ర్ణయు డావాలికి చావుతప్పదు మదుగ్రప్రౌఢచాపాశుగ
క్రియకున్ బాల్పడి, నీవె యేలగవలెన్ కిష్కింధ నీ నాదుని
ర్ణయ మింతే యిక చూడగోరుదువె నా నారాచవేగోద్ధతిన్.

అనెనోలేదొ రఘుప్రవీరుని ధనుర్జ్యాముక్త దిక్స్ఫోటన
స్వనసంయుక్త మహోగ్రవేగ చటులాస్త్రమ్మొండు దూరమ్మునం
దున మిన్నంటెడు తాళసప్తకము దోడ్తో వానినేలంటుతో
తునియల్ జేయుచు వచ్చిచేరె మరలన్ తూణీరమున్ వింతగా.

వాలినెదిర్చి ప్రాణములు వాసిన దుందుభియన్న దైత్యుకం
కాళము శైలమ ట్లెదుటగా పడియుండగ కాలివ్రేలితో
దూలగనేసె రాఘవుడు దూరముగా నది యాకసమ్మునం
దేలుచుపోయి క్రిందబడె నేశతయోజన దూరసీమనో.

ఆమహోద్భుతకృత్యమ్ము లరసినంత
కనులుదిరిగె సుగ్రీవుని కాళ్ళువడకె;
హనుమముఖము మాత్రము విప్పారి మెఱసె;
భానుసుతుడు రాముని తేరిపాఱజూచి.

పదిలముగా కరద్వయిని పట్టిన దెప్పుడు, కార్ముకం బికన్
వదలినదెప్పు డానిశితబాణము; నీచరణాంగుటమ్మునన్
గదపిన దెప్పు డాదనుజుకాయము రాఘవ! భూనభోంతరం
బదవద యయ్యె నయ్య భవదద్భుత భూరిబలప్రదర్శనన్.

దైవతకార్యమున్ నెఱప ధాత్రిజనించిన యేమురారివో
కావలెగాని మర్త్యుడవుగావు మహాత్మ ! భవద్భులోద్ధతుల్
భావనకందనట్టి పృథుపాటవ శౌర్యము లివ్వి, నాకికన్
నీవె శరణ్యమంచు కపినేతయు రాముని కాళ్ళపైబడెన్.

పావనమూర్తి రాఘవుడు పాలితధర్మదయాగుణుండు సు
గ్రీవుని లేవనెత్తి పలికెన్ విడుమీభయమింక వాలియున్
నీవనితామణిన్ విడచి నిన్నుదయన్ గనకుండె నేనియున్
చావిక తప్ప దాతనికి సత్యమునాపలుకంచు చెప్పగన్.

వాలినివాసమున్ గదిసి భానుసుతుండును విస్ఫురద్భుజా
స్ఫాలనజేసి ఓరితులువా విడుమీ రుమనింక నీదు ప్రా
ణాలను నిల్పుకొ మ్మిదియు నచ్చద యేనియు బైటకీడ్చి ని
న్నాలములోన బట్టి దునుమాడెద చూడుమటంచు నార్చినన్. 30

వాలియు లేచివచ్చి తన వాకిటికిన్ వెడనవ్వు నవ్వుచున్
దూలుచు తమ్ముజూచి ఒక త్రోపునకున్ బరువెత్తిడాగి యా
శైలమునందునన్, మరల సంగరమంచును వత్తు వేజగ
త్పాలుడు నీకుదిక్కగునొ వానిని నిన్నును జూతు నిచ్చటన్.

అని, సుగ్రీవుని బట్టుకొనినుగ్గుగదన్ని పంపగానతడు దీనుడై శ్రీరాముని
కాళ్ళపైబడెను. మీరిరువురు సమాన రూపులగుట నేనూరకున్నాను
ఆనవాలునకై నీవొకగజపుష్పమాల ధరించిమరలయుద్ధమున
కేగు''మని శ్రీరాముడు నుడివిధైర్యమొసంగెను -

వాలికిలెక్కలే దొకరిపల్కులు బాహుబలాతిగర్వదు
శ్శీలుడతండు; తారయును చెప్పిన దిర్వు రవార్యశౌర్య ధీ
శాలులు వచ్చి రర్కసుతుసాయము నీబలమింకచాలదో
వాలియటంచు, వాలికినిపట్టవు నెమ్మదినిట్టి పల్కులున్.

కన్నులను దుర్మదాంధ్యమ్ము గ్రమ్మినపుడు
మంచిచెడ్డలు కనరావు మనసునందు
అవనితలమున నెంతవా డైన గూడ
కర్మఫల మీగ జాలిన ఘనుడులేడు.

ఆ విధిన్నిర్ణయమ్ములటులైనవి, ఆమఱునాడె వాలిసు
గ్రీవులు పోరికిం జనిరి : శ్రీరఘురాముడు చెట్టుచాటుగా
కేవలమొక్కబాణమున గీటడగించెను వాలినేసి, సు
గ్రీవు డెడందలో దలచె పృథ్వి పునర్జను వందినట్లుగన్.

వాలికి పూర్తిగా దెలిసివచ్చిన వాతని దుష్టచేష్టలే
మూలనొ చిత్తమందు; రఘు పుంగవునింగనియంజలించుచున్
''పాలనసేయుమో ప్రభువ! పాపినినే నని'' వేడ నూర్వులో
కాలకుబోదువీవనుచు కారుణికమ్మునబల్కె రాముడున్.

ఆడినమాటదప్పని మహాత్ముడు రాముడు; భానుపుత్రునిన్
వేడుకమీఱ కీశపృథివీపృథురాజ్యపదాభిషిక్తు దో
డ్తోడ నొనర్చి వాలికిసుతున్ యువరాజుగజేసె నంగదున్,
కూడి నుతుల్ బొనర్ప కపికోటులు హర్షసమంచితార్భటిన్.

రామునిజూచి నప్పుడె పరాక్రమవహ్ని యతండు దివ్యతే
జోమహిముండు ధర్మగుణశోభిత సచ్చరితుండు సర్వవి
ద్యామధుమూర్తి యన్న తల పాహనుమంతున కిష్టు వేయిరె
ట్లై మదిదోచి రామునిపదాబ్జములన్ విడనాడిపోవదున్.

శ్రీచటులాననాంబుజుడు శ్రీరఘురామునిపై మనమ్మునం
దేచిన భక్తిభావముసరే, కడుదుర్ఘటమైన రామకా
ర్యాచరణమ్మునన్ దగు సహాయమొనర్చు విధమ్మదెట్టిదో
తోచక ఆంజనేయుడును తొట్రుపడున్ సతతమ్మునెమ్మదిన్.

సీతాన్వేషణనకు కపిసేనలు వెడలుట

వానలువెన్క బట్టినవి ప్రాతపగల్ కడముట్టరాజులున్
సేనలుగూర్చి శాత్రవులసీమలపైబడు శీతవేళలున్
గానగనయ్యె; నింక తనకార్యము కాగలయత్న మెవ్వరున్
పూనిన జాడలేక రఘుపుంగవు నాత్మకు లేదు శాంతియున్. 40

కమ్రహసితాస్యమున తిలకమ్ముదిద్ది
శిరమునందున పూవులు తురుముకొనిన
జనకజనుబోలు నచటి కాననతటమ్ము
నట్టె కనుచుండు రాము డేకాంతమునను.

లాలితమల్లికా సుమదళమ్ముల గూర్చిన పాన్పులట్లుగన్
నేలచెఱంగు లెల్లెడల నింపిన వచ్ఛశరద్విభావరీ
వేళలు వెండిక్రొందళుకు వెన్నెలలన్, మధురార్ద్రభావనా
శీలము లేలగా మిథునచిత్తములందు నవానురాగముల్.

వనసుమవీథులందు నెలబాలుని వెన్నెలవేళ రాముడున్
తనమదిలో సతీవిరహతాపము నాపగలేని కిన్కలో
వనచరనాథు నొద్దకును పంపెద లక్ష్మణు నాకపీంద్రునిం
గని యిదమిత్థమేరుపడ గట్టిగతేల్చు నటన్న యూహతో.

తనకును రాజ్యమిచ్చితిని, తన్వినిగూర్చితి, ముందుగానె యా
తనిపని జేసితిన్, రుమనుతారను గూడిన కామమత్తుడై
కునుకుచు విస్మరించె ననుకొందును నాపని; నీవుపోయి ల
క్ష్మణ కనుగొమ్ము కీశపతి చందమదేదియొ గట్టిగా న నన్.

నెలలున్ నాల్గుగతించె తానిటకురానేలేదు సుగ్రీవుడే
లలనాసంగతిజొక్కి రాముపనులన్ లక్షింపకున్నాడొ ఆ
యలసత్వ మ్మణగింతు నేననుచు కీశాధ్యక్షు చూడం జనెన్
జ్వలితోగ్రారుణలోచనుం డగుచు చాపంబూని సౌమిత్రియున్.

హనుమగ్రహించి రామవిభునాగ్రహ మా యిన పుత్రుతో ప్రభూ!
జనకజకోసమైవెదకు సాధనలేమయిపోయె నీవిలం
బనమును రాముడోర్వ డనుమానములేదిక నీవెపోయి యా
యనకునునీప్రయత్నముల నన్నిటినిన్ వచియించు టొప్పగున్.

నేనును విన్న పల్కెదియు నీచెవినుంచెద రామునాజ్ఞపై
నే నిముసమ్ము రాగలడు నీదరి కాకుపితోగ్రతీవ్రకీ
లానలదుర్నిరీక్ష్యవిలయాకృతి లక్ష్మణు డా యశస్వికిన్
మానసమందు రెండనిన మాటలు లేవిది నీవెఱుంగవే.

తనపనిలో విలంబనము తాళడు రాముడె యాగ్రహించుచో
మనగలవాడు లే డిదియు మానసమం దిడి వానరేశ్వరా
చను మిక నామహామహుని సన్నిధి కల్లదె మ్రోగుచుండె ల
క్ష్మణు ధనురుత్కటధ్వని దిగంతములెల్లను వ్రక్కలించుచున్.

మారుతియన్నపల్కులకు మానసమెల్ల చలింపగా గృహ
ద్వారమునందు లక్ష్మణుని దారుణ కార్ముకముక్త ఠం
కారము కూడ మ్రోగె, భయకంపితుడై కపినాథుడున్ రుమన్
తారనువీడి ఆత్రముగ ద్వారముజేరి వినమ్రభావుడై.

త్వరపడిన కార్యమగునె నాతప్పులున్న
క్షమ్యుడనుగాని నాలోటు గానరాదు;
తాళు మిదె వత్తు రామువద్దకు నటంచు
లక్ష్మణుకరమ్ము తనచేతులను గ్రహింప -

చాపమును దింపి యొకకొంత శాంతుడగుచు
లక్ష్మణుడు కానుపించిన తక్షణమ్మె
ఆంజనేయుని గూడ రమ్మనుచుబిలిచి
వానరపతి సుగ్రీవుడు బయలువెడలి -

సరసత లక్ష్మణుండు తనసాయముగానరుదేర రామునిన్
చరణములంటి ఓయికరుణాసుగుణాంబుధి రామచంద్ర ! నే
మఱవగలేదు నాడనిన మాటల, నీయెడ నాల్గుప్రక్కలం
దరయుము దేవ, యీప్రసవణాద్రికి వచ్చిన వానరావళిన్.

వారలె నాదునాజ్ఞబడి వచ్చిన వానరసేన లెక్కకున్
మీరిన వీరశేఖరు లమేయపరాక్రమధైర్యధూర్వహుల్
క్రూరుడు రావణాసురుడు క్షోణిజనెచ్చట దాచియుంచినన్
వీరలు పోయి చూచి గడువేగమె మాసములోన రావలెన్.

రాక్షసవీరులం జెనకి రాగల వేగసమగ్రసాహసా
ధ్యక్షులు వీరలొక్కొకరు, దైత్యవిదారణదక్షుడై చనున్
పక్షికులేంద్రసన్నిభుడు పావని నీవనితాగవేషణన్
దక్షిణదిక్కు కంగదుడు తక్కిన వానరసేన తోడురాన్.

ధీరతరాత్ములై బయలుదేరగ జేపె ముహూర్తముంచితిన్
దారుణ సాహసప్రళయ దర్పమహేశ్వరు లుగ్రశక్తిమత్
వీరవరేణ్యు లీకపులు వీరునునేనును నేడునీదుదా
సేరులమన్న మాటవిని శ్రీరఘురాముడొకింతయోచనన్.

ఇనసుతు నాదటన్ గవుగిలించి సుహృత్తను మాటకున్ నిద
ర్శన మిల నీవె యోవనచరాధిప యంచు నుతించు నంతలో
ననిలసుతుండు వచ్చి తనయంఘ్రుల వ్రాలుటజూచిరాముడా
హనుమను లేవనెత్తి హసితానన సుందర దివ్యమూర్తియై -

నమ్మితినామనమ్మున ఘనమ్ముగ నీమహనీయశక్తి, శౌ
ర్యమ్మును బుద్ధిసూక్ష్మతయు అంజనపుత్ర! నిశాటసైన్యసం
ఘమ్ములనొంచిజానకినిగాంచిన వార్తను దెచ్చు కార్యభా
రమ్మున సర్వదిగ్జయపరంపర లబ్బును గాక నీకికన్.

ఆకడ కేగినప్పుడు ధరాత్మజనిన్నును నమ్మదేమొ నీ
యాకపిరూపు జూచి యితడెవ్వడొ దానవుడన్న భీతితో,
నాకమలాక్షి కిద్ది గురుతయ్యెడు నామెకు నిమ్మదీనినిన్
గైకొనుమంచు రాముడిడెనాహనుమంతునకంగుళీయమున్.

వ్రేలికినున్నయుంగరము ప్రీతిగదీసి యొసంగువేళ నా
పాలిటి కాంజనేయ! యిది ప్రాణమునుమ్ము నిశాటవాటికా
జాలముమధ్య నేపగది జానకికిచ్చెదొ నీకునీపనిన్
మేలగుగాక యంచు మది మెచ్చుచు రాముడుపంపె నాతనిన్.

చేతికినున్న యుంగరపుజెల్వులు చూచినయప్పు డాదటన్
సీతయె జ్ఞప్తికిందవిలి చెమ్మగిలున్ కనుదోయి రామభూ
నేతకు పెండ్లివేడుకలె నెమ్మదినిల్చి, యొకొక్కమారు ని
శ్చేతనుడై కలంతవడు చెప్పగలేకను లోదలంపులన్. 60

పృథివిజపెండ్లినా డెదలోన నేభావ మేచెనో యిది మిథిలేశునకును
నాచేతికినితొడ్గనా డెట్టిమధురిమల్ చిందించెనో సీతచిత్తమందు
అనురాగనిలయ నాజనని కౌసల్యకే ప్రియము గూర్చినదొయీ పెండ్లికాన్క
చేతిప్రేలికెగాదు చిత్తమ్మునకుగూడ చిలికించె వెలుగు లీచిహ్నమనుచు,

తనకుజానకికిని పెండ్లిదినము నుండి
కూరుములుగూర్చి నట్టి బంగారుటంగు
ళీయకముగాంచి తమినాపలేక రాము
డాదరమ్మున గుండెల కద్దుకొనియె.

తిరిగి వేగమె నీవరుదెంచు దనుక
వేయికనులతో నిచట నే వేచియుందు
నచ్చటకు నేను శ్రీరఘుమ్మెవచ్చెద నని
నమ్మకమ్ముగ జెప్పు సీతమ్మతోడ.

అనివచియించు రాముచరణాబ్జము లంటుచు నంగుళీయమున్
కనులకునద్ది భక్తితమకమ్ములరన్ కరమందుదాల్చి ద
క్షిణదిశవెంబడిం జనెడు కీశబలమ్ములతోడ వేగమే
హనుమడుచేరి యేగె కుతుకాంచితనూతనదీక్షితాత్ముడై.

ఉంగర మందుకొన్న కపియోధునియుల్లము పల్లవించె, స
ర్వాంగములందు మేను పులకాంకురముల్ వహియించె, చిత్తము
ప్పొంగె ముదమ్మునన్ ధరణిపుత్రికనే కనుగొన్నయట్లు క
న్నుంగవనుండి రాలినవి నూతనహర్ష కవోష్ణబిందువుల్.

జనకుం దేశుభవేళ నీకనకభూషాలంకృతిన్ రామచం
ద్రున కర్పించెనొ, జానకీసతియు సంతోషమ్మునిండార రా
మునిహస్తమ్మున వ్రేలికిందొడిగె కూర్మ్మిల్మీర నేనాడు తత్
క్షణమందే మొదలయ్యె భాగ్యవిలసత్ కల్యాణముల్ధాత్రికిన్.

పారములేని దీక్షల నపారతపంబుల పుట్టువొందు నె
వ్వారికొ లభ్యమౌ మహిత భాగ్యములన్ దనుపొందగంటి నే
డారవివంశసంభవ నృపావళి కీర్తికిరీటరత్న మా
శ్రీరఘురాము డీపగిది సేయునె మన్నన లొక్కకోతికిన్.

అమలోదాత్త రమా సమంచిత మయోధ్యారాజ్య పట్టాభిషే
క మహోద్యన్మణి పీఠికన్ విజయ విఖ్యాతిన్ బ్రకాశించు రా
మమహీపాలుని యంగుళీయకము నన్మన్నించి ఆశీశ్శుభ
ప్రమదమ్ముల్ సమకూర్చుగా కనుచు లోబ్రార్థించె సామీరియున్.

రాముని మేనికాంతి విసరమ్ములు గ్రమ్మిన యుంగరమ్ము నా
కామితమెల్ల దీర్చు దశకంఠులు వందలు వచ్చి యడ్డినన్
దీమసమొప్ప గూల్తు, ధరణీస్థలి నెక్కడనున్న జానకీ
భామను జూచి వార్తగొనివచ్చెద వానరరాజు మెచ్చగన్.

ఏవసుంధరలోతు లీరీతి పండింపగలిగిన మేలి బంగార మిద్ది,
ఏనోమునోచెనో జానకీరాముల దాంపత్య మిద్ది సంధానపఱచె,
ఏతపమ్మొనరించి యేతెంచెనో రాముకరపద్మమున కలంకార మయ్యె,
క్షేమరాజ్యమున కీరాఘముద్రిక యెన్నివేలేండ్లు చిహ్నమై వెలయగలదొ. 70

అనుచు రామునియంగులీయకము బట్టి
కనులకద్దినదానినే తనివిదీర
మరలమరల నద్దుకొనుచు మురిసిపోయె
భూమి జాన్వేషణకు నేగు రామదూత.

హనుమయు వెంటరాగ బలులంగదజాంబవదాదిగంధమా
దనులును మైందుడున్ ద్వివిదతారసుషేణగవాక్షు లానలుం
డనఘులు నాల్గుదిక్పథములందున సేనలతోడ నేగి రా
జనకసుతాగవేషణకు శైలవనీ గహనాంతరమ్ములన్.

చాలుదు నేనొకండనె నిశాటుల నెల్లర గూల్చి రామభూ
పాలునివద్ద కిప్డె గొనివచ్చెద సీతను లోకమాత నం
చోలి వచించి యేగి రొక రొక్కరు దిక్కులవెంట ఆహవా
భీలసమగ్రమై సకలపృథ్వియె వెల్వడినట్లు వానరుల్.

మాలిని

వనతరు సుమవల్లీ వ్యాపృతంబైన భూముల్
అనవరత జలాపూర్ణాపగాన్వీత సీమల్
ఘనతర శిఖరాగ్రప్రస్థ రోర్వీధ్ర పంక్తుల్
వినుతగతి మహావేగోగ్రులై దాటుకొంచున్.

మణి రంగము

వాలముల్ పయిపయి నభమంటన్
పూలమొక్కలు పుణుకుచు గోటన్
వ్రాలుకొమ్మల ఫలముల తించున్
హేలగా కపులిటునటు గంచున్.

లయగ్రాహి-

ఏకడకు నేగి కన ఆకడనె వారలయి
తోకొనుచు మిత్రులను వీకదన మొప్పన్,
తోకలను త్రిప్పుచును పైకెగసి వేగమున
నాకతల మంటగల పోకడ లెలర్పన్,

ప్రాకుచును శైలములు తాకుచును శీర్షములు
దూకుచును లోయలను వాకలను ధైర్యో
త్సేకమున గంతులిడి కేకిసలు గొట్టుకొను
చాకపులు సాగిరటు తేకువ లెసంగన్.

సదమలదీక్షతోడ కపిసైన్యములెల్లను సర్వదిక్కులన్
వదలినసీమలేదు నలుప్రక్కలకుం జని సీతకోసమై
వెదుకనిచోటులే, దనురవీరుడతం డెట దాచి యుంచె నా
ముదిత నటంచు వేగముగ పోవని తావులులేవు వారికిన్.

పోవలె, నెచ్చటుండినను భూమిజజాడ నెఱింగి వేగమే
రావలె, రాముకార్యమిది బ్రాతిగ జేయకపోదుమేని సు
గ్రీవునియాజ్ఞ ప్రాణముధరిత్రిని ని ల్వదటంచు నల్దెసల్
త్రోవలబట్టి కార్యవిహితోత్సుకులై చని రెల్లవానరుల్.

నాలుగుదిక్తటమ్ములకు నల్వురునాయకు లాప్లవంగసై
న్యాళిని శిక్షణాక్రమమునంగొని యేగగ నందుదక్షిణా
శాలవణాబ్ధిసీమలదెసన్ హనుమన్ముఖులేగి రంగదుం
డేలికగా చలమ్మున మహీతలపాటన పాటవార్భటిన్. 80

నలువురితోటిపాటు తమనాయకువెన్నడి యేగుగాని యా
పలువురిమాటవేఱు తనభాధ్యతవేఱని యాంజనేయు డు
త్తలపడి చిత్తమందు తనదారులు తానె గణించుకొన్న యా
సలపయి దేలుచున్ పరవశమ్మున నుండు మహీజచింతనన్.

దనుజుం డెచ్చటదాచినన్ సరియె సీతన్దాను గొంపోయి,వే
అనకన్ నీవయి చూచిరావలయునయ్యా యన్న సుగ్రీవువా
క్య నినాదమ్ములు, నిన్నెనమ్మితినయా యన్నట్టి శ్రీరామచం
ద్రునివాక్యమ్ములె వాయుసూనుమదియందున్ మ్రోగు ముప్ప్రొద్దులున్.

తానై చూడగలేదు నేటికివి సీతాదేవతారూపమున్
గానీ మానసమందెదో త్రిజగతీకల్యాణసౌందర్యరే
ఖానూనామల దివ్యవిగ్రహ సమగ్రశ్రీమహామూర్తియై
కానన్వచ్చు సమీరసూనునకు నాక్ష్మాజాత తేజమ్మొగిన్.

రాముండెన్న వికుంతు డావిభునిభార్యన్ జానకిన్ రావణుం
డేమంచుం గొనిపోవజాలు నిది చింతింపన్ నిశాటాళినీ
భూమిన్ నిర్మథనం బొనర్చు పథకమ్మున్ దైవమీరీతి నే
దోమార్గంబున పన్నిన ట్లనిలజుం డూహించు నొక్కప్పుడున్.

నాలుగుప్రక్కలందు నయనమ్ములు జూడగ సీతకోసమై,
నాలుక రామ!రామ! యను నామమునే స్మరియించుచున్న దీ
క్షాలలితుండునై తనదు సర్వము రామ పదార్పణమ్ముగా
నేలచెఱంగులెల్ల ధరణీసుతకై వెతకాడు నాతడున్.

ఎక్కడకేగి దైత్యవిభు డెచ్చటనామెను దాచియుండునో
యెక్కడ చూడగానగు మహీజను, రామునికార్యమందు గ
ట్టెక్కుదునా యికన్ వనచరేశ్వరు డిచ్చిన మాటదక్కునా
యక్కట!యంచు నొక్కతడవాతడు సందియమందు నాత్మలో.

లేచిన కంటిఱెప్పలను లేశముమూయకయే ధరిత్రిపై
చూచినచోటులే తిరిగిచూచును దైత్యునిచావమోదగా
చాచినబాహువుల్ తిరిగి చయ్యన వెన్కకు తీయ డాత్మలో
రాచినరాపిడై యెసగు రావణుడన్న పదమ్మె వానికిన్.

దండులుగట్టి యట్లుచని ధారుణిభాగము నెల్లచోటులన్
కొండలనెక్కిరిన్ గుహలుకోనలుకానలుదూరి చూచిరిన్
బండలు పెల్లగించి పలుపాటులనొందిరి సీతకోస మా
చండతరప్రతాపబలశాసను లాకపి యోధు లెల్లరున్.

పవనకుమారుడే మితరవానరులేమి మహోగ్రమూర్తులీ
భువనముచాపజుట్టి ఒకమూలకులీలగ త్రోయగల్గువా
రెవరికి వారె; తప్పక మహీజనుగాంచెద మానిశాటులన్
బవరమునందు గూల్చెద మవశ్యమటంచు దలంతు రందఱున్.

తరువులనెక్కుచున్ గుహలదాటుచు అద్రులనుండిభూమిపై
కురుకుచు, అడ్డమౌనదులలోపడియీదుచు నేగి చేతికిం
దొరకు ఫలాదులన్ పుణికి తోడ్కొనిపోవుచు క్షుత్పిపాసలన్
సరకునొనర్ప రాకపులు జానకికై వెదకాడు దీక్షలన్. 90

స్వయంప్రభ

అంతబలాఢ్యులైన కపు లాకలిదప్పుల కింక ఆగలే
నంతటిదన్కకున్ వెదకు చాయెడనున్న మహాద్రికందరా
భ్యంతరమందు జొచ్చి కని రద్భుతమందుచు నొక్కతెవ్వరో
కాంత వసించు రత్నఫలకాంచిత కాంచనసౌధవీదులన్.

ఆయెడ నేయెడంగనిన హాటకరత్నవిచిత్రహర్మ్యశో
భాయుతదృశ్యముల్ మధురసాన్వితపక్వఫలోర్విజమ్ములున్
తీయనిపూవుదేనియలు దివ్యజలేజసరఃప్రదేశముల్
వేయివసంతసంపదలు విచ్చిన యట్టుల నేత్రపర్వమౌ.

వెలగపండుల నాసించి వెదుకబోవు
పాంధజనులకు పనస చేపడినరీతి
క్షుత్పిపాసార్తు లాకపికోటు లెల్ల
ఎప్పు డీ నిర్మలజలమ్ము లిన్ని గ్రోలి -

ఎప్పు డీ ఫలమ్ముల నారగింత మనిన
యాసతోడ ముందున కేగునంతలోన
ప్రభుతదీపించు గంభీరవాక్యఫణితి
ఆగు డివి తాకకుడని యాయమయు పలికె.

ఎవ్వ రీయమ మము నడ్డగించునట్టి
యతిశయము జూపుచున్న దేమైనగాని
యాగునది లేదనెడు వానరాళి నరసి
అంగదుం డాజ్ఞలిడి వారి నాపినంత -

ఏమని యాయమున్ బలుకరించుటొ తోచక సర్వవానర
స్తోమము ప్రక్కప్రక్కలకు జూచుచు నుండ సమీరసూనుడున్
మోమటుద్రిప్పి కైజతనుమోడ్చి వినమ్రవివేకమూర్తియై
యామెనుజేరినిల్చి మధురాదరరీతి వచించె నిట్లుగన్.

దివ్యయోగినీరూప దీధితుల వెల్గు
తల్లి! గైకొమ్ము మాదువందనము లివ్వె
ఒంటరిగ నీవిట వసించుచుంటి వేమొ
అడుగవచ్చునె నీవెవ్వరనుచు దేవి !

ఎవరి వీహేమసౌధమ్ము లీసువర్ణ
కమలకాసార సీమలీ సుమవనమ్ము
లీ మధురఫలవృక్షమ్ము లెఱుగనగునె
క్షుత్పిపాసలబడి వచ్చుచున్న మాదు -

రాకకును కలదొక్క కారణముతల్లి!
రఘుకులార్ణవచంద్రుడు రామమూర్తి
ధరణిబుట్టినదేవుడు తండ్రియాజ్ఞ
భార్యసీతమ్మతో వనవాస మున్న -

యదనుగని దుష్టు డా రావణాసురుండు
సీతనపహరించి చనె దక్షిణపుదెసకు
రాము డామెకొఱకు వనభూములెల్ల
వెదకుచుండ సుగ్రీవుతో స్నేహమమరె. 100

వానరపతి సుగ్రీవునిసేన యిద్ది
రాముకార్యార్థ మిట్లు మేమామెకొఱకు
వెదకుచును వచ్చిపడితి మీబిలమునందు
దృష్టినిలువ దీ శోభవీక్షించుటకును.

మాటలును జాల విద్దాని మహిమదెలుప
నయనవిభ్రమ మయ్యె నంతయును మఱియు
విపినసీమల సీతకై వెదకివెదకి
దప్పిగొనిన మా కీ సరస్స్థలము లరసి
మరలప్రాణముల్ వచ్చె నోమాత! యనిన.

హనుమని వాక్యమత్కృతియు నాతనిసాధుమనోజ్ఞరూపమున్
గని ముదమంది యాదివిజకాంతయు శీతలనీరమిద్దిగై
కొనుడని యిచ్చి రమ్యమధుకోశములైన ఫలోపహారముల్
తినుడని వారిముం దునిచె తృప్తిఘటిల్లగ నెల్లవారికిన్.

వినుతభక్ష్యభోజ్యమ్ముల దనివిగనిన
వనచరచమూసమూహమున్ గనుచు నామె
వినుడు నాచరిత్రము నుడివెదను మీకు
మయుడు విశ్వకర్మయు స్వర్ణమయమనోజ్ఞ-

చిత్రసీమగ దీని రచించినారు;
హేమ యను నాదు సకియ దీహేమసౌధ
రమ్యకాసార తరువన రాజ్యమెల్ల
ఆమెయును నాకొసంగె నీప్రాంతమెలమి.

మేరుసావర్ణి నాతండ్రి మీరు వినియె
యుందురును స్వయంప్రభను నేనుందు నిచట
యోగ మభ్యసనమ్ము సేయుచును సతము
నిశ్చలధ్యాన జపతపోనిష్ఠ తోడ.

ఈగుహజొచ్చి తాబ్రతికియేగ డెవండును, ఈజలమ్ములన్
ద్రాగిరికాదు మీరు మృతిదప్పిన దోకపులార, మీపనుల్
కాగల వింకమీద సఫలమ్ములు; బైటకు మిమ్మునంపెదన్
వేగమెకండ్లు మూయుడని ప్రీతిగ నామె వచించినంతనే.

జానకిని వెదుక వనచరేశ్వరుని యాజ్ఞ
మనము వచ్చినదారిని మనము బోక
వచ్చిపడినార మీబిలద్వారమందు
వింతలే యిందు మిగుల గన్పించుచుండె.

ఏదో రాక్షసమాయ కాదుగద నేడీకాంతవాక్రుచ్చు సం
వాదమ్ముల్ కడుక్రొత్తవైకనుపడున్, పైపైకితీపైన మ
ర్యాదల్ మాటలు చూపి తుట్టతుదకే యాపత్తు కల్పించునో
యా దైవమ్మే శరణ్యమై యిపుడు కాపాడన్వలెన్ వేగమే.

యనచు దమలోన గ్రిందుమీదగుచు నున్న
వానరులజేరి మెల్లన వాయుజుండు
భయపడగనేల ఆ పుణ్యవనిత నుడువు
మాటలందున లేదె నమ్మకమనంగ. 110

ఆత్మయుం దొక భీతియు ఆశకూడ
వేగిరింపగ ఆకపివీరులెల్ల
ఆమెనుడివిన దానికి నధికముగనె
కనులు గట్టిగ మూసి విప్పినక్షణమ్మె.

అంతయు చిత్రమైన కలగా నొకలిప్తయులోనె తద్బిల
ప్రాంతమునుండి వెల్వడుచు వారలు వచ్చిన త్రోవ జూచి వి
భ్రాంతియు కొంత తగ్గి తమబాటను పట్టుచుబోయి వార్ధిప
ర్యంతము వచ్చి చేరిరి ధరాత్మజ కన్పడు నన్న యాసతో.

కడలివరకును వారట్లు నడచుదనుక
మాటిమాటికి మనసున మఱపురాక
పలుతెఱంగుల నాస్వయంప్రభ మహత్తె
తలచు కొందురా కపులు సంతసము తోడ.

ఓపికతగ్గదేహములలో, మఱి వారనుకొన్నలక్ష్యమున్
దాపునలేదు, పోదగినదారియుతోచుటలేదు, చిత్తమిం
దీపటువార్ధినెల్లను తరించు ప్రయత్నమికెట్లు సాగునం
చూపిరి బిగ్గబట్టి కపులొక్కరిపై పొకరాచు చూచుచున్.

సంపాతిఉపదేశము

ధారణిజాత కన్పడదు దైత్యునిజాడయులేదు వెన్కకున్
నేరకపోదుమా బ్రదుకనీయడు భానుసుతుం డటంచు లో
నారటమంది కూర్చొనిరి అంగదు నంతటివారుగూడ, సా
మీరి యొకండె యాకడలిమేరలు లెక్కలుబెట్టు నెందుకో.

''నాడు జటాయు వా దనుజనాథుని చేతులయందు జచ్చె నీ
నాడు పయోధివద్ద మరణమ్మగునే మన''కంచు నేదొ మా
టాడుచు గుంపుగుంపులయి యాకపులందున కొందఱొక్కచో
గూడిరి యాత్మహత్యకయి గుండెలుజారిన దైన్యరూపులై.

బంధువులందు నాసగలవారయి యేగ దలంచువారు కి
ష్కింధకు మీర లేగుడిక, చేత నసింగొని కాలరూపుడై
యందె వసించుచుండు ప్లవగాధిపు డేమును చత్తు మీజల
మ్మందె యటంచు నాజలధియంచులు కొందఱు జేరు నంతలో.

ఆతరి కోతులాడిన జటాయువుసంగతి నాలకించి సం
పాతి యటన్నపక్షియును ప్రాకుచు మెల్లగవచ్చి యెట్టెటూ
బ్రాతిగ మీరలాడినవి పల్కులువింటిని నాదుసోదరుం
డాతతసాహసోగ్రుడు జటాయువు చచ్చెన రావణాహతిన్.

అయ్యయొ యెంతమాట విన్నానైనది యీపలు కాలకించియున్
చయ్యనలేచి సోదరుని జంపినవానిపయిన్ జనంగ నా
కియ్యెడ లేవు ఱెక్క లిట నెందుల కోకపులార మీరలున్
గుయ్యిడు చుంటి రేను సమకూర్చెడిదుండిన చెప్పు డర్మిలిన్.

పై నొకమాటగూడ వినబడ్డది మీరిట నాత్మహత్యకున్
బూనినయట్లు లీగతి సమూహపు జావున కేయుపద్రవం
బైనది మిత్రులార! చెపు డాదశకంఠునినుండి భీతి యే
దైనను మీకుగూడ గలదా వినగోరెద నంచు బల్కగా. 120

''ఎవరీపక్షి !మనుష్యవాక్యముల దానీరీతి మాటాడు, దా
నవకృత్య మ్మిది'' యంచు గొందఱుకపుల్ దవ్వైచనన్ మెల్లగా
పవమానాత్మజు డావిహంగమును సద్భావమ్ముతో జేరి మీ
రెవరయ్యా, యిటుసానుభూతిగ మమున్ వీక్షింతు రన్నంతలో.

చెంగట కేగుదెంచి యొకచిన్నము ధైర్యమువచ్చినట్టు లా
యంగదు డంత పూర్వకథనంతయు జెప్పుచు, పక్షిరాజ ! చే
యంగల యత్నమైనదిక నాకపిరాజుభయమ్ముచేత పో
వంగను లేము వెన్కకని వాకొనుటల్ విని పక్షినేతయున్.

ఔరా, రావణు డెంతనీచమును సేయంగల్గె నాతమ్ముకు
ఙ్టా రక్షోపతి చేతులన్ మడిసెనా! అచ్చోటనేనున్నచో
కారాకూరము బెట్టి రక్కసుని ముక్కల్జేసి యుందున్గదా
రారం డింకొక మారు నాయనుజువార్తాయోగముం జెప్పుడీ.

మావంశీయులు పూర్వమే దశరథక్ష్మాజానికిన్ మిత్రుల
య్యా వార్ధక్యము వచ్చిపడ్డ దిటు దేహమ్మందు నేనొక్కమా
రావిన్వీధిని సూర్యమండలము దాపైబోవ తద్వహ్నితీ
క్ష్ణావష్టంబడి కాలిపోయినవి ఱెక్కల్ రెండు కాకున్నచో.

చావంగొట్టి నిశాటు నీదినమె విశ్వారాధ్యు డారాముసే
వావిష్కార మొసంగియుండెదను గాదా ధారుణీపుత్రికన్
చేవల్ దక్కియిటున్న నాకు వినవచ్చెన్ గర్ణశూలమ్ములై
యీవార్తావళి యేమిసేయుటకు గానీ శక్తిలేదక్కటా.

పోనీ రామునిసేవ నాయనుగు దమ్ముండైన సేసెన్ భువిన్
బ్రాణంబుండిన దన్క నాకదె మహాభాగ్యమ్ము సుండీ, మఱొం
డీనామాటను గూడమీరు వినుడీయాధాత్రియందే స్థలం
బైనన్ నాకది యానవాలె మునుపీ యన్నింటినిన్ జూచితిన్.

ఎచ్చటికేగలేక యిటులే పడియుండిన నాకు నాసుతుం
డచ్చట నచ్చటన్ వెదకి యన్నమొకింతగ దెచ్చియిచ్చు వా
డెచ్చట జూచినాడొ వచియింపగ జాలనుగాని నాకడన్
క్రచ్చఱవచ్చి చెప్పిన యొకానొక సంఘటన మ్మెదందలో-

నాకుం గొంతగ జ్ఞప్తియున్న దొకకాంతారత్నముంబట్టి పెన్
పీకంబోయె నిశాటు డొక్క డిటులీవిన్వీథియం దంబుధి
ప్రాకారంబును దాటి లంకయను ద్వీపావాస మార్గంబు నం
దాకాంతామణి నోట విన్బడియె రామా ! యన్న పల్కొక్కటే.

ఆయమ సీతగావలయు నాపిశితాశియు రావణాసురుం
డే, యిక సంశయమ్ము వలదిచ్చటికిన్ శతయోజనమ్ము లీ
తోయధి కావలన్ గలదు ధూర్తుడు రావణుడున్న లంక మీ
రాయత ధైర్య సాహస సమన్విత శక్తులె గాన నందఱున్.

భావంబందు జనింపనీకు డిటుపై ప్రాయోపవేశ ప్రయ
త్నావేశమ్మును, తోచుచున్నయది నాయాలోచనమ్మందు లం
కావప్రమ్ములు జీల్చి యేగగల యుగ్రప్రౌఢ విక్రాంతతే
జోవర్ధిష్ణులు వైరిలోకదహనార్చుల్ గారె మీనాయకుల్. 130

మీరును పోదురాయెడ కమేయ జవంబున చూచివత్తురున్
ధారుణిపుత్రికన్, దురితదానవనిర్మథనప్రవీణరే
ఖారుచిరోజ్జ్వలత్ప్రళయకార్ముకరుద్రుడు రామచంద్రు డా
క్రూరనిశాచరాధముని గూల్చును తథ్యము నేనెఱుంగుదున్.

అనిలంకాపుర దుర్గమోత్కట రహస్యద్వార సంచారమం
దనుకూలమ్మగు త్రోవలన్నిటిని ధైర్యంబొప్పగా జెప్పి దీ
వెనళన్ బల్కుచు, వానరుల్ వినతులై వీడ్కొల్ప సంపాతియుం
జనె తమ్ముండు జటాయుసంస్మృతిగతశ్రద్ధాంజలుల్ దీర్పగా.

వనచరవీరులందఱి ప్రవర్తనమొక్కవిధమ్ము భక్తిభా
వనుడును స్వామికార్యవిధివత్పృథులాశయ దీక్షితాత్ముడా
హనుమని భావముల్ సకల మన్యవిధమ్మున బోవున ట్లెదో
మనమున నెంచు నాత డణుమాత్రము తంద్రతలేని ధీగతిన్.

వానరవీరుల నిరుత్సాహము

ఆ సంపాతి వచించుచున్నపుడు శ్రద్ధాసక్త చిత్తైక వే
షాసర్వస్వవిధేయుడై వినుచు తత్ సందర్భ సంభావ్యవా
చాసూక్ష్మార్థము లూహసేసికొను నాసామీరి వేమారు లా
శా సందీపిత భావరేఖ లెద నుత్సాహమ్ము లూరింపగన్.

తనయెదయెల్ల రామునిపదార్పణ తానొకమౌనమూర్తియై
వినినది సర్వమున్ తిరుగవేసి మనమ్మునతేల్చుకొంచు తా
చననగు రీతు లా దనుజజాతిప్రవర్తన లాపయోధిలం
ఘనఘనకార్యముల్ విలువగట్టుచు చూచుకొనున్ మనమ్మునన్.

తనపయిబెట్టె నాసుగుణధాముడు రాముడు సర్వకార్యసా
ధన మిది తీర్పనేవలయు తానయి యేగుపథమ్ములేనిరో
ధనియమబాధలున్ తనపదమ్ముల కడ్డుగవచ్చినన్ సరే
యను నొకనిర్ణయ మ్మతనియందు వెలింగిన దంతకంతకున్.

బింకమెలర్ప దైత్యు లొకవేళ భయంకరదుష్టవృత్తి న
న్నంకిలివెట్టి గుంజినను నాశిరమందున వెల్గు రామనా
మాంకిత మంగుళీయ మహిమం బొకడున్నది చాలు దానవా
తంకములన్ దహించు నను ధైర్యముగల్గె సమీరసూతికిన్.

మారుతిచిత్తమందొకటిమాత్రము స్పష్టము, విష్టపత్రయా
ధారమహోన్నతోజ్జ్వలవిధాపరమార్థగుణుండు రాము డా
ధారుణిజాత సీతయును తత్పురుషప్రథమానరూపవి
స్ఫారితమూలమౌ ప్రకృతిశక్తి యటన్నసత్యమున్.

గ్రీష్మతప్తమై వాడిన వృక్షరాజి
కంబుధారలు గురిసిన యట్టులయ్యె
ఆశ లుడిగిన కపి హృదయమ్ములకును
ధైర్యమొసగు సంపాతి వాగ్ధార లచట.

ఎట్టులో వచ్చితిమి మన మింత వఱకు
నిల్లలుకు మాత్రమున పండుగెట్టులగును
సీత జాడయు తెలియ వచ్చినది సరియె
నీరధినిదాటి యెవరు పోనేర్తు రటకు. 140

అనుచున్ ముందఱకేగి మానసము లూటాడంగ భీతిల్లుచున్
గని రా వానరవీరు లెట్టెదుట రంగత్తుంగ భంగార్భటీ
ఘనకల్లోల విఘూర్ణ విభ్రమ సముగ్రాటోప దీప్తోత్కట
స్వన సంరంభ విజృంభ సంచలిత దిక్చక్రావధిన్ వార్నిధిన్.

ఝుంఝూ ప్రభంజన చండవే గోద్ధూత భంగోత్కరంబు లంబరము ముట్ట
మకరధులీవ్యాళ నికరోగ్ర జలనాగ మీనసంతానముల్ మీదికెగయ
పాండుర డిండీర పటలమాలాకేళి వేలావధినిదాటి విరిగి పడగ
పర్వతోన్నత మహా భయద తరంగమ్ము లుర్విపై కుఱ్ఱూత లూగిరాగ,

అంతకంతకు ప్రబలమై అంతులేని
అలలతోడ కల్లోలమౌ జలధియందు
ప్రతికణముగూడ కడుభీకరముగ దోచె
కపిగణమ్ముల కెడదలు కంపిలంగ.

ఈసాగరమ్మటే ఇందిరా శీతాంశు పుణ్యమూర్తుల కైన పుట్టినిల్లు
ఈసముద్రమ్మటే భాసురోజ్జ్వలకాంతి రంజి తామలనవరత్ననిలయ
ఈమహార్ణవమటే ఈరేడులోకాల మేల్గోరు వేల్పుసామికిని సెజ్జ,
ఈవారినిధియటే మృత్యుజిద్వరశక్తి నమరాళి కిచ్చిన యమృతపాత్ర.

భూరిసౌఖ్యమ్ము లిడు తదుదారగరిమ
యిచట నణువైన నేడుకన్పింప దేమి?
శివుడుగళమున బంధింప చెదరిపడిన
ప్రబల హాలాహలకణోగ్రపటిమ దక్క.

దాటవలెన్ తరంగభయదమ్మయి మీదికి పొంగివచ్చు ము
న్నీటిని, క్రూరుడైన రజనీచరనాథుని లంకలోపలన్
కోటను జేరగా వలయు క్షోణిజకై యిది నిర్వహింపనా
పోటుమగం డెవం డని కపుల్మదులన్ గుడుసుట్లువోవుచున్.

ఒకడు తీరమ్ము జూచి వెన్కకునువచ్చు
కొలదిదూర మొక్కండు చూపుల నిగుడ్చు
ఒక్క డావలిదరిజూచి యూరకుండు
కడలి కడతల కురుకు నొక్కడును లేక.

ఆ కపిసైన్యనేత యగు అంగదు డంతట ముందునిల్చి ఓ
హో కపివీరులార! మహితోగ్రపరాక్రమమూర్తులార నే
డీకడలిన్ గమించి దనుజేశుని లంకను జేరువాడు మీ
లోకఅవయ్యెనా మదులలో నిటులేటికి సంశయింతురున్.

అటుచూడన్ కపిరా జనుక్షణము నాకైవేచియుండున్, మదో
త్కటదుష్టాత్ముడు దైత్యనాథుడును సీతాదేవిగొంపోయి తా
నెట బంధించెనొ, స్వామికార్యమిది సాధింపన్ గపిశ్రేణిలో
పటుశక్తిన్ వనరాశిదాటగల సత్వస్ఫూర్తి లేదాయిటన్.

నెల గడువిచ్చె నాపయిని నిల్వడహర్పతిసూతి తొందరల్
తొలగని ఱంతులీవఱకె త్రొక్కుచునుండును, చండశాసనుం
డలుక వహించెనేని మరియాదలుచూడడు వానికత్తికిన్
బలియయిపోవుకన్న బలవంతపుచావులె భద్రమయ్యెడున్. 150

రావణులంక జేరక ధరాత్మజజాడను జూడబోక మీ
రేవగతోడనో వెనుకకేగదలంతురయేని ప్రాణముల్
వోవుట తప్పవాక్షణము లోననె భీకరమూర్తి యల్ల సు
గ్రీవుని కత్తివాదర నొకించుక మానసమందు నెంచుడీ.

ఆదిన్ నాకొకభీతిగల్గినది యీయంభోధి దూరమ్ము తా
నైదాటంగల వారలెవ్వరని నేడావృద్ధపక్షీంద్రుడై
ర్యోదర్కాదర భాషణమ్ములవి నాయుల్లమ్మునన్ నూతనా
శాదీప్తిన్ వెలిగించి చూపినవి భాస్వద్గమ్య మార్గమ్ములన్.

నేనెటులైన నద్దరికి నేర్పుగ పోగల శక్తిశాలినే
గానిటు వెన్కకున్ మగిడిక్రన్నన రాగల సాహసమ్ములే
దైనను నేనెపోదు జనకాత్మజగాంచగ నంచు తెంపులో
నూనిన యంగదుం గనుచు నుండిన వృద్ధుడు జాంబవంతుడున్.

### జాంబవంతుని ప్రోత్సాహము

అంగద నీకునేల యిటులాగనితొందర వార్ధినెల్ల దా
టంగల శక్తిశాలి వగుటల్ విదితమ్మగుగాని నీవు పో
వంగ పనేమి ? యీప్లవగవాహినికిన్ యువరాజనీవు నీ
కుంగల కార్యనిర్వహణకుంగద వచ్చితి మెల్ల వారమున్.

ఏనో వృద్ధుడనైతి నావయసునం దీవార్ధిలెక్కా! మఱి
ప్లైనన్ పోయినదేమి రామనృపుకార్యార్థమ్ము సామర్థ్యుడౌ
వానిం జూపెద చూడుమాయెదుట దుర్వారోగ్రవేగోత్కటా
నూనప్రాభవసాహసుం డనిలసూనుండున్న వాడచ్చటన్.

అనుచును జాంబవంతు డట కంగదునింగొనిపోయి సర్వమా
వనచరసేనయున్ వినగ పల్కెనిటుల్ హనుమంతుజూచి, ఓ
యనుపమధైర్యసాహసబలాగ్రణి యంజనపుత్ర! నీ వెయీా
వనధిని దాటి ధారుణిజవార్తను తేగలవోయి లెమ్మికన్.

ఓయీా! నీబలమీవెఱుంగుదువాలేదో నీమహాసాహస
స్ఫాయద్ధీకర వాయువేగ విలసత్ప్రజ్ఞా వికాసోదయం
బీయావజ్జగమందు గన్పడదు, నీకీనీరధుల్ పల్వల
ప్రాయం బౌట నిజంబు లెమ్మిక మహోద్యద్ధీమతీ, మారుతీ!

తలచినజాలు నీదునెడదన్ త్రిదివంబును ముట్టుకొందు వా
వల దనుజేశులంకపయి పాదము నుంచినజాలు నీబల
ప్రళయమునందు దానవులుభస్మము కాగల రాధరాత్మజా
లలనను జూచి రాము కుశలమ్మును తెల్పెదవీవు పావనీ.

నీవంశోన్నతి నీదుదోర్బల సమున్మేషప్రభావమ్ములున్
భావమ్మందు దలంచుకొన్న క్షణమే ప్రాదుర్భవమ్మయ్యె నా
కీవిశ్వాసము, రాముకార్యమిదితండ్రీ ! వమ్ముగావించునే
యావద్విశ్వము క్రిందుమీదగుచు నీకడ్డమ్ముగా నిల్చినన్.

నిరుపమశక్తితో గరుడినిన్ బురుడింతువు సూర్యసూతికిన్
సరియగుదీవు నీమహితసత్త్వతనూబలధైర్యకీర్తులం
దరయగ రామలక్ష్మణులదర్పసమున్నతి దోచు, శేముషీ
గరిమమునందు గూడ సరిగానము నీకు సమీరనందనా. 160

భీమప్రాభవ ధైర్యసాహస మహావేగుండు వేదాంతవి
ద్యామేయప్రతిభాన్వితుం డఖిలలోకాతీతు డంచిట్టు లా
సామీరింగని జాంబవంతు డెలమిన్ శ్లాఘించు టాలించి హే
లామోదమ్ముల దేలి రెల్లరును గోలాంగూల యూథోత్తముల్.

మఱల జాంబవంతుడును, హనుమంతా! నీవంతయు
నెఱుంగుదువో లేదో గాని,

తెలిపెద నీదువంశపుప్రతీతిని విన్ము మహాత్మ! పుంజిక
స్థలయనునప్సరోవనిత శాపవశమ్మున జన్మమందె నీ
యిలపయి కుంజరుండను కపీంద్రునిపుత్రిక అంజనాఖ్యతో
నలరిన యామె నీజనని అందపురాశియు కామరూపయున్.

కేసరియన్న వీరకపికిన్ మధుమాధవమంజువల్లరీ
భాసురమూర్తియంజనయు భార్యగ నైనది గానివెంటనే
కేసరియున్ విరాగియయి కేలకమండలువూది సత్తపో
భ్యాసమునందె తాను గడపందొడగెన్ సమయమ్ము సర్వమున్.

నాకొఱకు చింత వలదు మనమ్మునందు
వాయుదేవుని వేడుమో వనిత యింక
ధన్యచరిత వీవగుదువు ధరణియందు
ననుచు కేసరి వచియించి యరిగె నెటకొ.

అదియు వసంతకాలసమయామలకోమల నూతనప్రసూ
నదళ పరీమళార్ద్రపవనమ్ములు పర్వులు బెట్టు దేశమా
సదమల సీమలందున ప్రశాంతనదీశిశిరోపచార సం
పద లలరారు చోట కుసుమాంగియు అంజనయుండ నొంటిగా.

ఆకమనీయభాసురశుభాంగి సొబంగులు చూచి సౌరభ
శ్రీ కలితుండు ప్రేమవివశీకృత చిత్తుడు వాయుదేవుడున్
పైకొని, కొందలంపడెడు భామిని నూరటబుచ్చి స్వాదుసు
శ్లోక నయప్రియోక్తి శుభసూచక వాచక మొప్పు నిట్లనున్.

నీకళ్యాణతనూవిలాస సుషమన్ నేజూచి కాంక్షించి నే
నీకైవచ్చిన వాయుదేవుడను తన్వీ నాపరిష్వంగముల్
స్వీకారమ్మొనరింపు మిద్ది పరమశ్రేయమ్ము నీకీర్తికీ
లోకంబందున రాదు లేశమయినన్ లోపమ్ము సాధ్వీమణీ.

అలనాడెప్పుడో మోహితాత్ముడయి ఫాలాక్షుండు శ్రీమోహినిన్
తిలకింపన్ చలితమ్ముగాపడిన తద్వీర్యం బవార్యస్ఫుర
ద్బలతేజోవికసన్మహామహిమ సంభావ్యంబు నాయందునన్
గలదద్దాన జనించు నీకుసుతు డొక్కం డీశుతేజంబునన్.

కారణజన్ముడున్ దివిజకార్యధురంధరు డాగమాంతవి
ద్యారమణీయమూర్తి కమలాసనతుల్యుడు సాధుభావనో
దారు డజేయవిక్రమవిదారిత శాత్రవు డచ్చకీర్తివి
స్తారుడు విష్ణుభక్తి భరితాత్ముడు నౌ సుతుడబ్బు నీకికన్. 170

అనుమాటల్ విధినిర్ణయమ్ములుగ నయ్యబ్జాక్షి భావించి మున్
దన యాత్మేశ్వరు డన్నపల్కులు భరద్వాజర్షి వాకొన్నదీ
వనలున్ నెమ్మదిలో ప్రతిధ్వనిత భాస్వన్మాధురుల్ చిందగా
ననిలున్ పాదములంటి భక్తినిరతిన్ప్రార్థించె లోలాత్మయై.

జననంబందితి వంజనాపవన సత్సంబంధసాఫల్యమై
హనుమా! శైవవరప్రసాదనమహత్త్వాంశప్రభావోన్నతిన్
ఘనతేజోనిధివై అజేయబలవిక్రాంతస్ఫురన్మూర్తివై
జనసంస్తుత్య వివేకభూషితుడవై సాధుస్వభావుండవై.

పినవాడే ఒక దోరపండని వియద్వీధీచరద్వేగివై
యినునిం బట్టగనేగు నీపయికి దేవేంద్రుండు వజ్రాయుధం
బనివార్యంబుగ నేయ చెక్కిలికిగాయంబయ్యె నానాటితో
హనుమంతాఖ్యుడవైతివీవు ధృతిమంతా విశ్వవిఖ్యాతితో.

మనమందున్ బసికూనయంచును దలంపంబోకవజ్రాయుధ
మ్మును తానేయునె యింద్రుడం చధికకోపోద్రిక్తుడై వచ్చి నీ
జనకుండాపెను గాలి, నక్కతన నస్తవ్యస్తమై లోకమె
ల్లను వాపోవదొడంగె నోయి! తనువుల్ప్రాణావశిష్టంబులై.

పరువుల్బెట్టుచు వచ్చి నీజనకునింబ్రార్థింప మౌనుల్ సురల్
కరుణన్ వాయువు వీచసాగె మరలన్ కంజోద్భవుం డింద్రుడున్
వరుసన్ నీకిడినా రశస్త్రమృతియున్ స్వచ్ఛందనిర్యాణమున్
వరదానంబులుగా నినుం బొగడి శశ్వత్ప్రీతివాక్యంబులన్.

సరసీజోద్భవుతుల్యమౌ మహిమయున్ సాహిత్యసౌహిత్యముల్
చిరజీవిత్వము సాధువాదము జగజ్జేగీయసద్వర్తనం
బరివీరప్రళయోగ్రదోర్బలము లత్యంతమ్ము నీకబ్బు సు
స్థిరభాగ్యమ్ములుగా నటంచు మునులున్ దీవించిరయ్యా నినున్.

ఇదినీజన్మకథాసుధాలహరి మాకీనాడిటన్ జీవన
ప్రదమై భాసిలు భాగ్యమియ్యది సముద్రాంభస్సు లెల్లన్ భవ
త్పదవిక్రాంతిని దాటి వత్తువు వియత్పర్యాప్తమార్గమ్మునన్
విదితప్రాజ్యబలాగ్రణీయ త్రిజగద్వీరాంజనేయాహ్వయా!.

విను మింకొక్కవిశేష మర్కునికడన్ విద్యార్థిగాజేరి నీ
పిననాడే బహువేదశాస్త్రవిలసద్విద్యావిధుల్ నేర్చి నా
వనఘా విద్యలయందుగాని బలధైర్యస్ఫూర్తులన్గాని నీ
కెనలేరీజగమందు దివ్యగుణ ప్రహ్వీయాకృతీ మారుతీ!

ఎఱుగనియట్టు లీమహిమలెల్లను నీవిటులూరకుంటివో
కరువలిపట్టి! రామవిభుకార్యము నీయది లెమ్మికన్ భవ
చ్చరిత మపూర్వధైర్యబల సాహస దిగ్విజయాప్తకీర్తిసుం
దరమయి వెల్గునోయి శశితారకభాస్కర మౌచు నాయనా!

ఈపాథోనిధి దాటి రాగలుగు దీవేయంచు మా(ప్రాణముల్
నీపై బెట్టితిమయ్య వాయుతనయా, నీధైర్యశౌర్యస్ఫుర
న్నైపుణ్యమ్ము మదిందలంచి కపిసైన్యంబూర్జితోత్కంఠతో
దాపైనిల్చిరి వీరలందఱిమనస్తాపమ్ము లార్పంగదే. 180

అతులప్రీతిని జాంబవంతు డిటు లాహన్మంతు నగ్గించు సం
స్తుతు లౌత్సుక్యత నాలకించి కపియోధుల్ ముందు కొక్కొక్కరే
నతశీర్షముల వచ్చి మ్రొక్కిరి మహానందమ్ముదీపింప మా
రుతికాసల్ నునుమోసులెత్తిన గగుర్పుల్‌గ్రమ్మ దేహమ్మునన్.

హనుమంతుడు సముద్రమును లంఘింప నుద్యుక్తుడగుట

భల్లూకేశ్వరుడన్నమాట లవి సర్వమ్మున్ యథార్థమ్ములై
యుల్లాసమ్మునుగొల్ప మారుతియు స్వీయోదాత్తవేగాంచితో
ద్యల్లీలామహనీయసాహసబలౌద్ధత్యమ్ము లొక్కింత తా
నుల్లంబందు గ్రహించి యొక్కబిగితో హుమ్మంచు నుగ్రాకృతిన్.

ప్రాంచద్భక్తిని రామనామమెడదన్ భావించి సామీరియున్
పెంచెన్‌దేహము నభ్రమార్గములకున్, విక్ష్వేడనోద్వృత్తి ఝు
ళ్పించెన్ వాలము, దిక్తటాక్రమితవైజృంభమ్ముదీపింప కా
న్పించెన్ భీకరదుర్నిరీక్ష్యవిభవోన్నిద్రైక తేజస్వియై.

వరజన్మండను వాయుసూనుడను భాస్వద్భాస్కరాశీర్విని
ర్భరసత్వాఢ్యుడ రామదూత నతులప్రారంభవత్ పాట వో
ద్ధురతన్ దూకెద వేయియోజనములద్రుల్ ప్రక్కలింపంగలన్
పురుహూతున్ బరిభూతు సేయగల, నంభోరాసు లింకించెదన్.

తిరుగన్‌నేర్తు త్రివిక్రమక్రమసముద్దీప్తైక దివ్యాకృతిన్
ధరణిన్ దాటి నభమ్మునంటి జలదాంతస్ఫీతవిద్యుత్తునై
ధరణీజాతను చూచివచ్చు టిక దథ్యమ్మంచు తోచున్ నిశా
చరుడెందుంచిన గూడ; మీరలిట నిస్పందేహులై యుండుడీ.

ఈధరాస్థలమ్ము సుంతయేని నిల్వబోకనాదు
పాదఘట్టనముల గ్రుంగి బ్రద్దలై నశించునేమొ
పాదమూని యీమహేంద్రపర్వతాగ్ర మెక్కి వేగ
పోదు నబ్ధిదాటి మాతభూమిజాతనుం గనంగ.

అని గంభీరవచశ్చమత్కృతులతో నయ్యాంజనేయుండు ప
ల్కిన వాలించుచు జాంబవంతుడెలమిన్ లేనవ్వుదీపింప ఓ
హనుమా పెద్దల ఆశిషమ్ము లిక నీయందుండి నీచేయుఈ
ఘనకార్య మ్మది సర్వదిగ్విజయ భాగ్యమ్మై విరాజిల్లుతన్.

భయముల్వీడి ప్రమోదముంగనిరి నీబాంధవ్యు లీవానరుల్
జయధాటిన్ జలరాశిదాటి ధరణీజాతన్ విలోకించి మా
నయనోద్భాసిగ నీవువచ్చుదనుకన్ దైవానుచింతామనో
నియతిన్ మేమిటనుందు మోయి హనుమా నీవేగిరమ్మాయికన్.

పటుశైలప్రవికంపనోగ్రబలవిస్ఫారుండు, వారాన్నిధి
స్ఫుటదూరప్రవిలంఘనప్రవణవిస్ఫూర్జన్మహావేగుడు
త్కటతేజుండు సమీరసూనుడు మహేంద్రగ్రావమం దెక్కె ప్రా
క్తటశైలోన్నతశీర్షమం దుదయమార్తాండప్రకాశాఢ్యుడై.

సలలితపుష్పవల్లికలు చల్లనినీడలు శాద్వలస్థలుల్
జలనిలయమ్ములున్ సకలజంతువిహారవిశాలభూములున్
గలిగిన యామహేంద్రగిరి కందర సానుతలమ్ములన్ ముద
మ్మలరగ సంచరించె నమరాధిప తుల్యుడు వాయుసూనుడున్. 190

శైలతటముల నటునిటు సంచరించి
తడవుసేయక అంజనతనయు డంత
మేను పెంచి వాయువునుకుంభించిలోన
గిరిశిరాన నిలిచె మేరుగిరియునోలె.

పవమానసూనుని పదఘట్టనమ్మున పగిలిబీటలువాఱె పర్వతమ్ము,
ఫలవృక్షములుక్రుంగె జలధారలుప్పొంగె పొరుగుసీమలకేగె పులుగులెల్ల.
పడుచులేచుచుబోవు ఫణిలోకఫణరాజి ధరణీధ్ర శిఖర కేతనములయ్యె,
దారితోచక గుహాద్వారమ్ములను వీడి పరువులెత్తెను మృగప్రతతివెలికి.

మునులు గంధర్వు లటనున్న జనములెల్ల
వీకచెడి నల్గడల కాందిశీకులైరి
తోటివా రొక్కరునులేని బాటసారి
వోలె నిల్చినది మహేంద్రశైలమచట.

చంచద్వాలనిపీడితాభ్రతల ముత్పాదమ్ముగా సాహసో
దంచ దుర్వారిమహోగ్రదేహబలు డుత్సాహమ్ముదీపింప కు
ప్పించెన్ మారుతి వార్ధిలంఘనజవోద్వేలప్రభావోద్ధతుల్
పంచారించి సమస్తదిక్చలితమై బ్రహ్మాండ మూటాడగన్.

జయము! శ్రీరామకార్యసంసక్తమతికి,
జయము! సీతాగవేషణ సాధుకృతికి,
సకలమునిగణ దేవతా సంస్తవార్హ
వితత ధార్మికవ్రతికి మారుతికి జయము!

మత్తకోకిల

వానరాన్వయమందు భాసుర భవ్యకీర్తిపతాకవై
ఈనభస్థలి దూరమున్ గమియించి వారిధిపారమున్
కానజాలిన వీరశేఖర! కల్గుగావుత నీకికన్
దానవాంతక విక్రమోన్నత ధైర్యసంపద మారుతీ!

ఉత్సాహ.

నీవొనర్చుపుణ్యకార్యనియతికిన్సహాయమై,
పావకప్రదాహక ప్రభావమెల్ల నీదియై,
ఆవిహంగనాథు గరుదనంతశక్తి నొందుచున్,
రావణప్రవృత్తికిన్, పరాభవ మ్మొనర్చుమీ.

స్రగ్విణి.

భూమిజాన్వేషణస్ఫూర్తి శుంభద్ద్రుతీ
రామకార్యార్థనిర్వాహ దూతాకృతీ
భీమసత్వాన్వితోద్వేగ వాయుప్రతీ
కామరూప ప్రకర్ష ప్రవీణోన్నతీ.

విజయ మంగళము.

దేవతాసమూహమొసగు దీవనల్ఫలించి మిగుల
నీవుపోవుచోట్ల నెల్ల నీబలమ్మమోఘమగుచు
ఈవిశాలజగము నిన్స్తుతింపగలుగు విజయమంగ
ళావహప్రమోదభరము హనుమ నీయశమ్ము వెలుగు. 200

అనిమిన్నంటెడిరీతి వానరుల హర్షామోద నాదమ్ము ల,
య్యనిలాపత్యము యౌగపద్యముగ నాయాకాశమున్ దాకుటన్;
వినిపించెన్ గనుపించె నాకవిచరద్విద్యాధరీ కిన్నరీ
జన గంధర్వ సురాళి విస్మయ వికాసవ్యగ్రులై చూడగన్.

అశ్వాసాంతము.

ఇదిహనుమడు నీపనికై
యుదధిన్ లంఘించుసాహసోద్యమమహిమా
స్పదకథ శ్రీరామా! రస
హృదయ స్వాదిష్టముగ రచించితి స్వామీ.

రామా నీసేవలనా
సామీరియె గుత్తకొనియె సర్వమ్మును నా
కేమిమిగిలినదయా! స్వా
మీ మీయిరువిరికథను రచించుట కంటెన్.

హనుమంతునిచరితము నం
దనురక్తియు నీమృదుచరణాబ్జమ్ములపై
మనమున భక్తియు నొకటై
నను నిల్వగనీయని రచనమ్మిది రామా!

ఎదివ్రాసిననీభువి నా
బ్రదుకున కొకవెలుగుదారి ప్రాపించునొ య
య్యదియే యీశ్రీహనుమ
త్కథయని వ్రాసితినిరామ! తత్ఫలమీవే!

ఇనవంశోత్తమరామ! నీపదయుగీభృత్యుండు శ్రీయాంజనే
యునిగాథన్ మధురార్థశబ్దముల నవ్యోద్యత్ప్రబంధమ్ముగా
ననుసంధించుచు నీకొసంగితినిదేవా! యిద్దిమత్సాహితీ
ప్రణుతస్వాదుఫలమ్ము మీహృదికుదారప్రీతి కల్పించుతన్. 206

గద్య

ఇది శ్రీ భారతీకరుణాకటాక్షలబ్ధకవితావిశేష హరితసగోత్రపవిత్ర
సత్రాజార్యరత్నమాంబాపుత్ర కవిశేఖర, మధురకవి, కవిభూషణ
భారతీప్రసన్నేత్యాదిబిరుదాంచిత, బుధజన విధేయ
సుబ్బారాయనామధేయప్రణీతంబైన శ్రీహనుమత్ప్రబంధమునందు
శ్రీరామసుగ్రీవులమైత్రి వాలివధ, సీతాన్వేషణకు కపిసేనలువెడలుట
స్వయంప్రభగుహ, సంపాతిఉపదేశము వానరులనిరుత్సాహము
జాంబవంతునిప్రోత్సాహము సముద్రలంఘనకు హనుమంతుడుద్యుక్తు డగుట
అను కథలుగల పంచమాశ్వాసముతో ప్రథమభాగముసంపూర్ణము

ఓమ్ తత్ సత్

# శ్రీ ప్రసన్న భారతీ గ్రంథమాల
## శ్రీ కొండేపూడి సుబ్బారావుగారి-ఉత్తమ సాహిత్య గ్రంథములు

| నెం. | పుస్తకము పేరు వివరములు, | ప్రతి 1 కి వెల రూ.లు |
|---|---|---|
| 1. | గీతామృతము : 1993 ప్రచురణ భగవద్గీత 18 అధ్యాయముల మూలము పద్యతాత్పర్య సహితము | 30.00 |
| 2. | పరమేశ్వరి వచనము. శ్రీ దేవి భాగవతమునకు సంక్షిప్త రూపము | 20.00 |
| 3. | విజయగీత వచనము. శ్రీ భగవద్గీత ననుసరించి వ్రాసిన పౌరాణిక నవల | 20.00 |
| 4. | ప్రసన్న భారతి-ఈనాటి దాదాపు 170 మంది సుప్రసిద్ధకవుల కవితా సంకలనము. సరస్వతీస్తుతి 1,2 భాగములు | 25.00 |
| 5. | సౌందర్యలహరి మూలము-తెలుగు పద్యతాత్పర్య సహితము | 15.00 |
| 6. | శివానందలహరి ॥ | 10.00 |
| 7. | ద్వాదశజ్యోతిర్లింగములు ॥ | 10.00 |
| 8. | ముకుందమాల ॥ | 6.00 |
| 9. | ఈశ్వరార్పణము-శతకము | 8.00 |
| 10. | హనుమత్ స్తోత్రము-శతకము | 4.00 |
| 11. | దేవీపంచాశిక-దేవి, లక్ష్మి, పార్వతి, సరస్వతుల స్తుతి పద్యములు | 3.00 |
| 12. | ప్రార్థన దండకములు వినాయకుడు మొదలు హనుమంతుని వరకు 12 | 3.00 |
| 13. | శ్రీ సరస్వతీదేవిమహత్త్వము వచనము | 3.00 |
| 14. | శ్రీ హనుమత్ప్రబంధము పద్యకావ్యము మొదటి భాగము | 35.00 |

**పోస్టుఖర్చులు ప్రత్యేకము** : వెలముందుగా M.O. చేయవలెను. వి.పి.లు పంపబడవు.

**ముద్రణలోనున్నవి** : కవితావాహిని (పద్యకవితలు)
వచనములు : ఆంధ్రరఘువంశము. ఆంధ్రరాజుల చరిత్ర, సాహిత్య సౌరభము, కుమార విజయము

: పద్యకావ్యములు శ్రీ వేంకటేశ్వర కర్ణామృతము సూర్యనారాయణ శతకము

: శ్రీమద్రామాయణము, శ్రీమద్భాగవతము, ఉత్తర రామాయణము, మహాభారతకథ, శ్రీదేవీభాగవతము మొ.వి

47-10-5, ద్వారకానగర్, విశాఖపట్టణం - 530 016

# మా వంశక్రమము - నా సాహిత్యకృషి

**కొండేపూడి సుబ్బారావు**

**గ్రంథకర్త,**

**సంస్థాపక సంపాదకుడు. ప్రసన్న భారతి సాహిత్య పత్రిక**

మా పూర్వీకుల నివాసము కొండేపూడి గ్రామము, పశ్చిమ గోదావరి మండలము భీమవరము సమీపమున గోదావరి కాలువ ఒడ్డున. ఆ ఊరి పేరే మాయింటి పేరు. ఆర్వేల నియోగి బ్రాహ్మణ శాఖ- మాతండ్రి సర్రాజు గారు, తాత సుబ్బన్నగారు, ముత్తాత నరసింహముగారు. మా తాతగారి పేరే నాకు పెట్టిరి. ఆ పేరు క్రమముగా మారి లోక వ్యవహారమున సుబ్బారావు అయినది.

మా నాన్న గారిని గురించియే గాని అంతకు ముందు వారిని గురించి మేమెఱుగము - వారందరు పెద్దలు గడించి యిచ్చిన ఏ కొద్దిపాటి పొలమో వ్యవసాయము చేసికొని ఏ పంచనో నలుగురు పిల్లలకు చదువు చెప్పి, వచ్చిన దానితో సంతృప్తిపడి కాలము శాంతముగా గడపిన సాధుజీవనులు. మా జనని రత్నమ్మ గారు చేబ్రోలు గ్రామము (పశ్చిమ గోదావరి) ఆదూరి వారి ఆడుపడుచు. వీర వెంకట్రామయ్య గారి రెండవ కుమార్తె. వివాహమయిన తరువాత మా నాన్న గారు చేబ్రోలు వచ్చి స్థిరపడిరి - బాల బాలికలకు ఆ ఊరి రామాలయము అరుగుల మీదనే వారి బడి - నాకు 'ఓనామా' లతో అక్షరాభ్యాసముగ 'సరస్వతి నమస్తుభ్యం' అనిపించినది ఆ దయాహృదయుడే. ఈ నాటికిని ఆ గ్రామమున నన్ను సుబ్బన్న గారనియేపిలుచుచు మా నాన్నగారి మంచితనమును గూర్చి ఎంతయో చెప్పుదురు.

వంశములో నున్న పృథ్వీ తత్త్వ విశేషమేమో పొలములు దొడ్లు తోటలు చెట్లు చేమలు అనిన మా నాన్న గారికి ఎంతో యిష్టము. మా పెదతల్లి గారు కనకదుర్గమ్మ భర్త బొమ్మిరెడ్డిపల్లి గంగరాజు గారు ఆ యూరనే ఉండువారు. వారు సంపన్న గృహస్థులు ఉదారులు. బంధువులకు సాయము చేయు చుండు వారు. దైవచింతనలు తీరిక గలిగినపుడెల్ల మా నాన్నగారు వారి పొలము పనులను చూచు చుండువారు. వారింటనే మా నివాసము - మేము నలువురము. మా అక్క కనక దుర్గాంబ, తమ్ముడు సత్యనారాయణ, చెల్లెలు అన్నపూర్ణమ్మ. నా జననము 1916 నాకు ఎనిమిదేండ్లయినా నిండని చిన్న తనము నందే మానాన్న గారు, ఒక పుష్యశుద్ధ ఏకాదశి ముక్కోటి ఏకాదశి, సంక్రాంతి ఉత్తరాయణ పుణ్యసమయమున, ఏ వ్యాధియు లేకనే మా పెద్దనాన్న గారి తోటలో చెట్టు నీడను కూర్చున్న వారట్లే దివంగతులయిరి. వారికపుడు నడి వయస్సు అయిఉండవచ్చు. మానాన్న గారి మృతికి గ్రామమున దుఃఖింపని వారు లేరు. అంతటి సౌజన్యమూర్తి ఆమహనీయుడు. మేము నలువురము తల్లి చాటు చిన్న పిల్లలము - మాకు గల

ఆస్తి పాస్తులు మానాన్న గారికి గల మంచి పేరే. మా పెదతల్లి, పెదతండ్రి గార్ల ఆదరముతో వారి యింటనే ఉంటిమి. వారి పొలములు పనులు మానాన్నగారు చూచిన అభిమానమున మా తమ్ముడు సత్యనారాయణను, సీతారామాంజనేయులు అను పేరున వారు దత్తత గైకొనిరి. మా యింటి పిన్నలు పెద్ద లెల్లరును నిరంతరము భాగవత పఠనమున ఆసక్తి గలవారు. చిన్న నాటి ఆ అభ్యాసమే నాకు గల సాహిత్య ప్రవేశమునకు కారణము-

మా అక్కగారు కనకదుర్గాంబ సమీపమున నున్న కైకరం వాస్తవ్యులు శ్రీ ఆదూరి విశ్వనాథముగారి భార్య మా చెల్లెలు అన్నపూర్ణమ్మ చేబ్రోలు లోనే ఆదూరివారి కోడలు. భర్త నరసింహము.

నా వివాహము చాల చిన్నతనము 1930 లో అయినది. భార్య శ్రీమతి సుబ్బలక్ష్మి ఆరుగొలను గ్రామము తల్లాప్రగడ సుబ్బారావు గారి కుమార్తె. ఆర్థిక కష్టములవల్ల మధ్య మధ్య ఆగుచు ఎట్లో మా అమ్మగారి పట్టుదల వలన 1938లో కాకినాడలో బి.ఏ. ఉత్తీర్ణుడ నైతిని. వెళ్ళిన పరీక్ష లన్నిటి యందున ప్రథమ శ్రేణి ప్రథమ స్థానములు గడించితిని. వ్యాస వక్తృత్వ పరీక్షలలో బహుమానములు, మంచి ఉపకారవేతనములు, విశ్వవిద్యాలయ స్వర్ణపతకములును లభించినవి - చదువు ఎట్లున్నను ఉద్యోగవిషయమున అవి చాల గడ్డుదినములు. కొన్ని దినములు ప్రయివేటు ట్యూషనులు, కొన్ని దినములు ఒక అచ్చుఆఫీసు గుమాస్తా పని సాగి 1940 అక్టోబరు లో డిఫెన్సు అక్కౌంట్సు డిపార్టుమెంటులో జేరి క్రమముగా సీనియరు అక్కౌంట్సు ఆఫీసరు పదవినంది 1974 లో ఉద్యోగ విరమణ నందితిని - ఉద్యోగ సందర్భమున పూనా జబ్బల్‌పూరు, అలహాబాదు, మద్రాసు, సికింద్రాబాదులో తిరిగి విశాఖపట్టణమున రిటైరై యిచ్చటనే స్థిర నివాసమేర్పడినది. 1975 లో మా అక్కగారు, 1976 లో మా తల్లి గారు, 1995 లో మా బాగారును పరమపదించిరి.

నాకు ముగ్గురు సంతతి. కుమార్తె విద్యావతి; కుమారులు; చి॥ సర్వేశ్వర ప్రసాదు ప్రస్తుతము బ్యాంకు ఆఫీసరు వీని భార్య చి॥సౌ కామేశ్వరి. విజయవాడ శ్రీ పిండిప్రోలు భాస్కరరావు గారి కుమార్తె. మా అక్క ఆదూరి కనకదుర్గాంబ గారి కుమారుడు చి॥ భీమారావు రైల్వే ఇంజనీయరునకు మా కుమార్తె చి॥సౌ॥ విద్యావతి నిచ్చితిమి. వారి కుమార్తె చి॥ సౌ॥ గీతాలక్ష్మి మా రెండవకుమారుడు చి॥ శ్రీనివాసు భార్య. అతడు బెంగుళూరు ఇస్రో సంస్థలో సైంటిస్టు ఇంజనీయరు. దైవానుగ్రహమున అందరును వారి వారి కుటుంబములతో అన్న వస్త్రముల కేలోపమును లేక ఉన్నారు --

## నా సాహిత్యకృషి - ప్రసన్న భారతి సాహిత్య పత్రిక

ఉద్యోగ విరమణ మందిన 1974 నుండియు బాల్యము నందలవడిన సాహిత్యాభిరుచితో మఱికొంత స్వయంకృషి సాగించి, శ్రీ సరస్వతీ కరుణాకటాక్షమున పెక్కు పద్య గద్య గ్రంథములను

వ్రాసితిని. వీటిలో కొన్నిటి పట్టిక వెనుక పుటలోనున్నది. ఎక్కువగా ఆధ్యాత్మికములే. దాదాపుగా నేటి కేబది యయినవి.

నా రచనల ఫలితముగా అనేక సన్మానములు సత్కారములు పురస్కారములు లభించినవి, - బిరుదులు వచ్చినవి, కొన్ని సాహిత్య సంస్థలను స్థాపించి నడిపితిని.

ప్రస్తుతము నాసాహిత్య కృషి, నిర్విరామ కావ్యరచనతో పాటు "ప్రసన్న భారతి" సాహిత్య త్రైమాసిక పత్రికను 1993 లో స్థాపించి నడపుచున్నాను -- పూర్వాంధ్ర సాహిత్యము నందు పద్యకవితయందు ఆసక్తి సడలిన నేటి పరిస్థితులలో వేయేండ్ల సంపదగా మన కబ్బిన ప్రాచీనాంధ్ర సాహిత్య వైభవమును పరిరక్షించి భవిష్యత్తునకు అందజేయు కర్తవ్యము నేడు మన యందున్నది.

అందులకే ఈ ప్రసన్న భారతి పత్రిక.

ప్రసిద్ధులయిన మహా పండితులు కవుల రచన లిందు వచ్చుచున్నవి. ప్రస్తుతము ఈ పత్రిక చాల ఆవశ్యకము. నేడు ఇట్టి పత్రిక తెలుగున మరియొకటి లేదు అని నలుమూలల నుండియు ప్రశంస లందుచున్నవి మనజాతి చరిత్ర సంస్కృతి విజ్ఞానము తెలిసి కొనుటకు ఋషికల్పులయిన మన పూర్వకవుల కావ్యములే మన కాధారము.

ఇది మన భాషాపత్రిక, మన అందరి పత్రిక. పిల్లలకు పెద్దలకూ ఎల్లకాలము పనికివచ్చే ఉత్తమ సాహిత్య పత్రిక ఇది. ఆంధ్రప్రజానీకము తమ ఉదార సహాయ మొసగి ఈ పత్రికకు సుస్థిరత్వము చేకూర్చగలరని నా విశ్వాసము.

---



Acc 30

894.8
SU

6-3

అమ్మా భారతి ! ఆంధ్రభాషకు మనోజ్ఞాలంకృతుల్ గూర్చు కా
వ్యమ్ముల్ వ్రాయు కవీంద్రు లుండి రెవరేవాదమ్ములన్ జేసినన్,
సమ్మాన్యంబగు సంప్రదాయకవితా సంధాన మీ నవ్యకా
వ్యమ్మేపారుత సాహితీమధుర సర్వస్వ ప్రతిష్ఠాంకమై.

శ్రీరామాంజనేయుల మహిమ.

భూమిని ధర్మపాలనకు బుట్టిన విష్ణువు రాము డాపరం
ధాముని దివ్యనామ జపతత్పరు డూర్జిత భక్తిభావుక
శ్రీమధుమూర్తి మారుతి; విశిష్ట చరిత్రులు వార లిర్వురున్
భూమి జనావన ప్రథిత పుణ్యమనస్కులు సద్యశస్కులున్.

ఏకడ రామగాథ వచియింతురొ ఆకడ హర్షబాష్పరే
ఖాకమనీయ భాసుర ముఖంబున మారుతి వచ్చి భక్తిభా
వాకలిత ప్రసన్న మధురాకృతితో నుపవిష్టుడై వినున్
ప్రాకట సర్వలోక పరిరక్షణదక్షుము లా చరిత్రముల్.

రాముని జెప్పుచో సుగుణరమ్యుడు, సంతతరామకార్యదీ
క్షామతి రామతత్త్వ మధుసార పరిప్లుత యోగసాధనా
ధీమహిముండు వాయుసుతు దివ్యకథల్ సయితమ్ము విన్నదున్
కామిత సత్ఫలప్రద లగణ్య మహత్త్వ పటుత్వ రమ్యముల్.

అమలోదాత్తము లార్యసన్నుతులు దివ్యానందసంపత్సుధీ
విమల జ్ఞాన వివేకరంజితము లుద్వేలస్ఫురత్ సాహితీ
రమణీయమ్ములు వాయుసూనుని కథల్ రాజత్ ప్రభావాఢ్యవి
భ్రమసాకల్యము లౌచు కర్ణయుగళీ పర్వమ్ములై పొల్చెడిన్.

వదనసరోజమందు ప్రతిభానసముదారము బ్రహ్మతేజమున్,
సదమల వేదశాస్త్రచయసారము సర్వము వాక్కులందునన్,
బుధజనరక్షణైక మధుపూరము చల్లని చూపులందునన్
విదిత మహత్త్వ తోరముగ వెల్గెడి సుందరు డాంజనేయుడున్.

శ్రీకర రామనామ జపసిద్ధి ప్రసిద్ధిని గన్నమేటి, ము
ల్లోకములందు నింతటి బలుండిక లేడనిపించుకొన్న, సు
శ్లోకుడు, వేద శాస్త్రహిత సూక్తులెఱింగిన జ్ఞాని సర్వవి
ద్యాకమలాసన ప్రతిము డా హనుమన్ నుతియింప శక్యమే. 20

హరి యవతార మారఘుకు లామల రత్నము రామభద్రుడున్
హరునిమహాంశతో జనన మందిన ధీయుతు డాంజనేయుడున్
హరి హరు లిట్లు దైత్య దురి తౌఘములన్ విదళించి ధర్మమున్
స్థిరముగ నుర్విఁ నిల్పిన విశేష దయామయ సద్గుణాన్వితుల్.

తలవని తలంపు నాదుచిత్తమ్మునందు
కలిగె నొకనాడు విద్యుద్వికాసమటుల
రామకార్య నిర్వహణ ధురంధరుడగు
వాయునందను చరితమ్ము వ్రాయు కోర్కె.

అంతట తప్తహేమ సముదంచిత సార మయూఖ మాలికా
క్రాంతము, బ్రహ్మ భావ విసర ప్రథమాన విదగ్రగణ్యధీ
మంతము, వజ్రవిద్ధహనుమంతము, ధ్యాన నిమీలి తార్ద్రనే
త్రాంత మొకండు నాదు కనులందున నిల్చిన దాంజనేయమై.

నేననుకొన్న రూపమహనీయత అద్భుత రీతి నీగతిన్
మేనున పుల్క లేచి, కలిమిన్ చెలిమిన్ విలసిల్లు చుండ నా
పూనిక తీర్ప గల్గు వెరవున్ వర మీయగ వేడినాడ నా
వానరరూపదేవుని అపార కృపారమణీయ భావునిన్.

ఎవని మహత్త్వగాథ రచియింపగ నెంచితి దీక్షనూని యా
పవనసుతుండె నాయెడల ప్రాపుగ నిల్చి రచింపజేయుతన్
ప్రవిమల సాధుశబ్ద రసవత్ పరిపూర్ణ మనోజ్ఞ వైఖరీ
వివిధ విశేష కావ్య పదవీ మృదురీతుల నీ ప్రబంధమున్.

మును పీపావని గాథ లెల్ల కవితా పుణ్యోదయుల్ వ్రాయలే
దని కాదీరచనమ్ము, నా హృదయ మందత్యంత సమ్మాన్యమై
హనుమద్దివ్య పదార్చ నానుభవ హర్షాధిక్య సంపత్తి కా
రణ మై వ్రాయగ జేసె నా కపివర ప్రజ్ఞా విశేషమ్ములన్.

ఒక భక్తుండని యందుమా, ఒక మహా యోగీంద్రుడే అందుమా
ఒక వీరాగ్రణి యందుమా, సుగుణ ధీరోదాత్తుడే యందుమా
ఒక వేదాంతియె యందుమా, సకల మీ యూహావధుల్ చాలవ
య్యకలం కోత్తమ సాధు సచ్చరితుడా హన్మంతు వర్ణింపగా.

ఆవాల్మీకి మొదల్ పురాణ రచనా వ్యాసంగ దీవ్యత్ సుధీ
శ్రీ విద్వన్మణు లెంద ఱెందఱొ కవుల్ చిత్రించి రా రామగా
థావిన్యాసము అందు మారుతి చరిత్రన్ సూక్తి వైచిత్రి, నా
యావేశమ్ము రవంత యబ్బినను నాయత్నమ్ము సాఫల్యమా.

ఇనవంశాగ్రణి రాముభూవరుని ముందేకాగ్ర చిత్తమ్మునన్
వినమత్ శీర్షుడు భక్తి బంధుర కళా విద్యోతి తాప్యాబ్జుడున్
జనితానంద వ [illegible] సౌందర్య సౌజన్యుడా
హనుమ ద్దేవుని రూప మెన్నియు నొయ్యన్ చక్షురానందమై.

హనుమంతుండను నామ మందుగల దివ్యత్ర్వాభవం బెట్టిదో
మనమం [illegible] నమ్ము విల్చినను తన్మాహాత్మ్య ముద్వేల మై
తనరున్ భావము వందొకానొక మహోత్సాహమ్ము కార్యమ్ములం
[illegible] విమాత్మ శక్తిమయ ధైర్య స్ఫూర్తి చేకొత్తగా. 30

[illegible]

గణనకు మీఱు సద్గుణనికాయము సర్వము మూర్తి గొన్నటుల్
మనసున కంద బోని మహిమాన్వితమౌ నొక దివ్య తేజమౌ
హనుమడు, సాధువాద సుగుణాఢ్యుడు, స్వచ్ఛయశస్కుఁ డౌ మహా
త్ముని కెన గాన రారు విబుధోత్తము లైనను శీల సంపదన్.

చంపక మాలిక.

జననము నంది శంకరుని శక్తియు వాయు బలోగ్ర వేగముల్
తనవిగ, పిన్ననాడె హరిదశ్వుని పండని మింటి కేగుచున్
హనువున నిల్పగల్గి యమరాధిపు వజ్రము, వేదవిద్యలం
దనుపమ పాండితిన్ బడసి యర్కుని వద్ద, కపీంద్రు కొల్వులో-

అనుచరు డౌచు రామునికి నాప్తుడునై జనకాత్మజాత్మకై
వననిధి దాటి లంకకును వహ్నిరగిల్చి నిశాట కోటి కిం
దనభుజశక్తి జూపి, వసుధాసుతకున్ రఘురామమూర్తికిన్
మనములయందు శాంతిగొను మాటల తోడ మహాముదమ్ముగూ-

ర్చిన సుహృదాత్ముడై, సమర సీమను రామునికిన్ సహాయుడై
దనుజుల బట్టి కూల్చుచు మదమ్మున, లక్ష్మణు మూర్ఛదేల్చి, జ్ఞా
ననిధి ధరిత్రిజాతకడ నమ్రత మీఱగ రామ తత్త్వమం
దనితర సాధ్యమైన పరమార్థ రహస్య విధాన మెల్ల నే-

ర్చిన కపి పుంగవుండు చిరజీవియు భావి విరించి దేవుడై
అనిశము రామ మంత్రమధురామృత పాన వినోది తాత్ముడై
మనిన సమీర పుత్రు మహిమన్ బఠియించిన ఆలకించినన్
జనువిల సార్థకమ్మయి ప్రశస్త సమస్త సుఖమ్ములందెడిన్.

చేతులు మోడ్చి భక్తిమెయి జేరిన ఆర్తజనాళి కాత్మలన్
భీతిని మాన్పి, ధైర్యము లభింపగ జేసి, అభీష్ట సత్ఫల
ప్రీతి నొసంగి, మానసము శ్రీరఘురామ పదాంబు జార్చన
స్ఫీత మొనర్చు దివ్యగుణ శీలము లాహనుమద్విలాసముల్.

ఉత్పల మాలిక.

భూమికి భారమై అమరభూమికి కంటకు లైన దానవ
స్తోమము నుక్కడంచు పని తొందర సేయ వికుంఠ మందిర
స్వామి దయాళుడై మనుజ జన్మము దాల్చిన విష్ణు దేవుడా
రాముడు, సర్వసద్గుణుడు రాజిత సత్య పరాక్రమ క్రమో

ద్దామ గుణుండు, వేద నియతవ్రత దక్షుడు, ధర్మపాలన
శ్రీమహనీయ దీక్షితుడు, శీలిత మానవ ధర్మ నిష్ఠుడా
రాముని కొక్కపత్ని, ప్రమురవ్రత నిర్ణయ సత్య సంధుడా
రాముని దొక్కమాట, సమరప్రళయోగ్ర ధనుః ప్రచండుడా

రాముని దొక్కబాణము, విరాజిత నిత్యదయావిలాసవి
ద్యామహిముండు భూమి తనయా హృదయాంబుజ లోలు డాపరం
ధాముడు రామచంద్రునికి నమ్మిన బంటయి పొల్చు జ్ఞానతే
జోమహితాత్ము డా పవనజుం డిక నెంతటి వాడు కావలెన్.

ఆసామర్థ్యము లాసముద్రతరణోద్యత్సాహసమ్ముల్ రణ
వ్యాసంగోగ్రపటుత్వముల్ చతురదౌత్యారంభముల్ కార్యదీ
క్షాసంకల్పము లుత్తమాశయసదాచారప్రకాశమ్ము లై
యాసామీరికె చెల్లె; సర్వజనమాన్యస్వాదుగాథావళుల్.

శ్రీమద్విష్ణ్వవతారు డూర్జితదయార్ద్రీభూతచేతస్కు డా
రామక్ష్మాపతి స్వామియౌనట; ఉరుప్రజ్ఞామహోద్యద్గుణ
స్తోముం డంజనసూతి భృత్యుడట,సంస్తుత్యప్రభావైకదీ
క్షామర్యాదలు దివ్యబాంధవము లా స్వామిత్వ భృత్యత్వముల్.

ఎక్కడ పుట్టుపుంగవియె, నెవ్వరిలాలనపెద్దయయ్యె తా
నెక్కడనేర్చె శాస్త్రములనెల్ల, మహాబలధైర్యసాహసం
బెక్కడనుండివచ్చె, భువి నీతని పూర్వ జనుఃఫలంబులై
దక్కెనుగాక మారుతికి; ధన్యగుణోజ్జ్వలపుణ్యమూర్తికిన్.

వరజన్ముం డురు సాహసుండు, శ్రుతివిద్యాబ్ధిపారంగతుం
డరిలోకప్రళయుండు, రామపదపూజాసక్తు డౌదాత్త్య స
చ్చరితుం డుత్తమకార్యదీక్షితు డుదంచద్బ్రహ్మతేజోమహో
ద్ధురదీవ్యద్వదనాంబుజుండు, హనుమంతుం డన్న సామాన్యుడే.

మచ్చున కైన, సాధుగుణమాన్యుడు మారుతి జీవితమ్మునన్
మచ్చయటన్న దొక్కయణుమాత్రము గానని సర్వధర్మసం
పచ్చరితాత్ము డంజనతపఃఫలభాసురమూర్తి యాత, డా
యచ్చపు పుణ్యరాశి నను లౌదురె వేల్పు లికెందతేనియున్.

తలచుకొలంది రామవసుధావరుడేమి, సమీరసూనుడా
లలిత గుణాఢ్యుడేమి? విమలమ్ములు ధార్మిక మూలముల్ సుధీ
విలసిత వేదసూత్రపదవీసముదాత్తవిధమ్ము లాచరి
త్రలు శశితారకార్కముగ రాజిలు నెన్నియుగమ్ము లేగినన్.

వ్రాసినచో పవిత్రగుణభవ్యములైన ప్రజాప్రయోజనో
ద్భాసిత సచ్చరిత్రములె వ్రాయవలెన్; హనుమత్ప్రవర్తనా
భ్యాసములెల్లనీపగిదిభాగ్యములై పరమార్థమార్గవి
న్యాస వికాస యోగ్యములు నై విలసిల్లు జగద్ధితమ్ములై.

సరస సలక్షణమ్మును ప్రసన్న కథామధురార్థశబ్దసుం
దరమును సంప్రదాయనియతమ్మును వ్యాకృతిబద్ధవాక్యని
ర్భర మగు గ్రంథనిర్మితియు పైపయినున్నదె? కావ్యదృష్టితో
నరయు విపశ్చిదగ్రణుల కంతయొ యింతయొ తృప్తినీవలెన్.

కావ్యరచనా సంకల్పము.

హనుమత్స్తోత్రముపేర నొక్కశతకం బాసక్తితో వ్రాసినా
డను పూర్వ మ్మది పొందగల్గెను పొగడ్తల్ పెక్కు లద్దానితో
దనివింగానని భావతీవ్రత లెడందన్ తొందరల్ సేయు తీ
ర్చున చేబూనితి విద్ది నాకొలదివేర్పుల్ కూర్పుతేర్పాటుగా.

అన్నామారుతి! నేనెవండను మహాత్మా! నిత్య సత్కార్యసం
పన్నం బైన భవచ్చరిత్ర లిఖియింపన్; నామనోవాంఛ లీ
సన్నాహంబులు సాధుశబ్దకవితాస్వారస్యపద్యక్రమం
బెన్నన్ నీపలికించు పల్కులివి గాదే పూర్ణవిద్యాకృతీ! 50

నాకున్ నీకథవ్రాయుకోర్కె హనుమంతా! జన్మసాఫల్యమౌ
ప్రాకామ్యమ్మను, రామకార్యమయి కన్పట్టున్ మహాకావ్యదీ
క్షాకర్తవ్యము సాగనిమ్మిది వచశ్చాతుర్యసాహిత్యరే
ఖాకళ్యాణముగా భవత్కృపామధురవీక్షాశీః ప్రసాదమ్ముగా.

పరమేష్ఠిముఖసరోవరహంసి వాణీకరాంభోజ కచ్ఛపీరవమధూళి,
మాతృదేవీ దత్తమహితాశిషవిశేషలబ్ధ విద్యామహాలంబనమ్ము,
బాల్యవేళాభ్యస్త భాగవతపురాణ పద్యపారాయణ వ్రత ఫలమ్ము,
మద్గురుస్థానమ్ము మహితాంధ్ర సత్కావ్య వాసంతవనపుష్పపరిమళమ్ము,

ఏడుగడయును నాతోడునీడ గాగ
బాసటగనుండి హనుమత్ప్రబంధ మనెడి
నవ్యకావ్యనిర్మాణ యత్నమ్మునందు
నన్నునడిపించుగాత సన్మార్గమందు.

గౌతమీతటమున గజయానపాటవమ్మలరంగ నడచి నన్నయ్య నాడు,
తెలుగుపల్కుల తీయ తేనెసోనలజాలు లబ్ధియైపొంగి తిక్కన్ననాడు,
కవిసార్వభౌమత్వ కనకాభిషేక సన్మానమ్ము లంది శ్రీనాథునాడు,
మందార మకరంద మాధుర్య వాగ్ధార లమృతమ్ము గురిసి పోతన్ననాడు,

భువనవిజయవిహార వైభవములరసి,
ఆధునికకవిలోకభావాంబరముల
సాహితీచంద్రకళ నింపు శారదాంబ
చెలగి వటియించుగాక నాజిహ్వయందు.

అమ్మా! భారతి! నేటి ఆంధ్రుల కవిత్వాకాశమార్గమ్ములన్
గ్రమ్మెన్ కారుమొయిళ్ళు, కైతల కలంకారమ్ములై వెల్గు ఛం
దమ్ముల్ బంధములంచు నెంచి వెడవింతల్ బోవుచున్, గద్యవా
క్యమ్ముల్ కైతలటంచు వ్రాయుదురు కట్టా యెంత వ్యత్యాసమో!

అగణితసాధుశబ్ద మధురామృతధారలు తెల్గుపద్యపుం
బిగువు లెఱుంగలేక పరవిద్యలు తేలికయన్న వెఱ్ఱిలో
తెగబడి తెన్గుకైత, బలుతెన్నుల వ్రాయుచునుందు రిప్పుడీ
వగపులపాలుసేయక కృపన్ గను మీయెడ మమ్ముభారతీ.

పలుకుంబల్కున తేనెలూరు కవితాస్వారస్యముల్ నన్నయా
దులు సృష్టించిన సంప్రదాయములు ఛందోబద్ధపద్యోదయో
జ్జ్వలసాహిత్యము లీకవిత్వవిధముల్ వద్దంచు వాదించువా
రలమార్గమ్ములనాపి పద్యమునుసంరక్షింపు మో భారతీ.

ఇవి యేవో తలపుల్ మనమ్మున ముదమ్మింగల్గు నువ్వెల్గులై
గవియన్ పూర్వమహాంధ్రసత్కవుల మార్గమ్ముల్ ప్రబోధమ్ములై
చవులూరించిన కావ్యగౌరవము లాజ్ఞాపించుసాహిత్యవై
భవమై యొప్పు నవప్రబంధముగ సంభావించి తీ గ్రంథమున్.

ఇదినాఆశయు ఆశయమ్మగును దేవీ! నీకృపాలోకనా
స్పద సంపన్మహిమమ్ముగాదె కవులున్ సాహిత్యవారాన్నిధిన్
సుధలం ద్రచ్చిన, క్ష్మాతలేశ్వరులుమెచ్చుల్ జూపినన్; దత్కృపా
మధులేశమ్మును నాపయిం జిలుకు మమ్మా చాలు, వాగీశ్వరీ! 60

కృతిపతి నిర్ణయము.

తనసర్వస్వము రామభూవిభుని పాదద్వంద్వ సం సేవకై
వినియోగించిన ధన్యజన్ముడు జగద్విఖ్యాతచారిత్రుడా
హనుమం డాతని స్వామినే కుతుక మేపారన్ కృతిస్వామిగా
వినతుల్‌జేసి యొసంగినాడ మృదుమాధ్వీరమ్య మీకావ్యమున్.

గారామొప్ప నలంకృతిప్రతతి గాన్కలెవ్వెట్టి, ఈకావ్యక
న్యారత్నమ్మును నీకొసంగితిని రామా !నవ్యసాహిత్యవి
ద్యారాజ్యమ్మున కీమె రాజ్ఞియయి విద్యల్లోక మర్పించు ఆ
శీరమ్యోక్తుల పొందగావలె యశశ్శ్రీరోచిరభ్యున్నతుల్.

యశము సప్తసంతానమ్ములందు కృతికె
కృతికివస్తువు హనుమచ్చరిత్ర మయ్యె,
కృతిపతియు నయ్యె శ్రీరాము, డింతకంటె
భాగ్యసంపద లేమి గావలయు నాకు.

పరతత్త్వమ్మొక రాజమూర్తి, పరతత్త్వాధ్యేతయై ధర్మపుం
దెరువుల్నేర్పిన పుణ్యమూర్తియొక; డీధీవర్యులస్మత్కవి
త్వరసాకల్పిత మీవిశిష్టకృతికిన్ బ్రాపై విరాజిల్లుటల్
పరమార్థమ్ము పురాజనుః ఫలసముద్భాగ్యమ్ముగా కన్యమే?

కృతిపతిరామచంద్రధరణీశుడు కోసలసింహపీఠమం
దతిశయ రాజ్యలక్ష్మియుతుడై కొలువుండినవేళ నంజనా
సుతుడు తదంఘ్రిపద్మయుగశోభల జూచుచునున్న దృశ్యమా
తతసకలప్రసిద్ధి లిడి తన్వునుగావుత మీప్రబంధమున్.

షష్ఠ్యంతములు.

రామునకును, వర్షాభ్ర
శ్యామున, కినవంశ నదమలార్ణవ రాకా
సోమున కసురాళిదళన
స్థేమున కరిభీమునకును శ్రీరామునకున్.

క్రతుసంరక్షణధృతికిని
ప్రతివీరార్భటహృతికిని బహుసత్కృతికిన్
వితరణగుణవిస్తృతికిని
శ్రితజన రక్షణమతికిని సీతాపతికిన్.

సురపూజితచరణునకును
నరవరకులభూషణునకు నయసుగుణునకున్
పరిరక్షితమునిగణునకు
స్థిరధర్మాచరణునకును శ్రితశరణునకున్.

ధీరున కాశ్రమధర్మవి
చారున కఖిలాగమపథ సంచారునకున్
వీరునకును కపిబలవి
స్తారున కఘదూరున కరిసంహారునకున్.

సుధికిని సమస్తసద్గుణ
నిధికిని మునిసన్నిధికిని నిజబలవిజితాం
బుధికిని నిరతదయాసే
వధికిని దాశరథికి బుధవరసన్నిధికిన్.

హనుమత్ సేవిత పదునకు
వినయవిశేషాస్పదునకు వేదవిదునకున్
జనగణ సంపత్ప్రదునకు
ఘనయుద్ధవిశారదునకు కపివరదునకున్.

ఇట్లుసంస్తుతించి.

చంద్రునకు నూలుపోగైనచంద,మెనయ,
పాలకడలికి జలకణప్రాయముగను,
రామచంద్రునిపాదనీరజములందు
ఈచిఱుతకబ్బ మెలమి నర్పించినాను. 72

# శ్రీ హనుమత్ప్రబంధము

ప్రథమాశ్వాసము

శ్రీ సామీరి కరార్చిత
భాసుర చరణాభిరామ! బహుశుభనామా!
త్రాసిత దనుజస్తోమా
శ్రీసూర్య కులాబ్ధి సోమ సీతారామా!

అని శ్రీకరుడును కౌసల్యాకుమారుడును, సీతామనోహరుడును, హనుమత్సేవిత చరణాంబురుహుడును, దయాసాగరుడును కృతి పతియునగు శ్రీరామ చంద్రుని సంస్తుతించి, రామనామ చింత నామృతాస్వాద నానంద భావుడును, నిరుపమాన తేజస్స్వ రూపుడును, వరజన్ముండును, అజేయపరాక్రమ సమన్వితుడును, కార్య దీక్షా దక్షుడును, ఆంజనాదేవి పుత్రుడును, ఏతత్కథానాయకుడునగు ఆంజనేయుని సంభావించి దైవ చింతన తత్పరులైన బుధజను లెల్లరకు అభ్యుదయ పరంపరాభివృద్ధిగ నా యొనర్పం బూనిన హనుమత్ప్రబంధంబను గ్రంథమ్మునకు కథాక్రమం బెట్టిదనిన :

ప్రభాస తీర్థము.

శ్రీకరమయి, పశ్చిమర
త్నాకర తీర్థస్థలముల నతిసుందరమై
ప్రాకట బహువిధ మహిమో
త్సేకం బగుచును ప్రభాస తీర్థం బలరున్.

పన్నీటి వలిమించు మున్నీటి తుంపురుల్ చలువ వెన్నెలలతో చెలిమిసేయ రంగ దుత్తుంగ తరంగోత్కరశ్రేణి పర్వతాగ్రములతో పంతమాడ చలువంపు క్రొన్నురువు తెలివెల్గు చాయలు నింగి నీలిమలను భంగపఱుప, లోనున్న రత్నాంచి తానూన దీధితుల్ మార్తాండ కాంతికి మారుపలుక.

అమలకాంచన కమ్ర చూర్ణముల దెచ్చి
మేలిపడకల దీర్చిన లీల దనరు
లలిత సుస్నిగ్ధ సైకత స్థలులెసంగు
సరస సౌందర్య మచ్చటి సాగరమ్ము.

పావనమై ప్రవాహజల భాసురమై, సతతోర్మిపంక్తి కా
ప్లావిత భూమిభాగమయి, లాస్య విలాసములన్ సరస్వతీ
శైవలినీలలామ తన స్వామికి సాగరమూర్తి కచ్చటన్
సేవలు సేయుచుండు నిజశీతల శీకర చామరమ్ములన్.

పవనాహతిని లేచిపడునట్టి కెరటముల్ భాసుర లాస్య విభ్రమము దెలుప
వికసితనవపుష్పవితతి రాల్చురజమ్ము పునుగుజవ్వాదుల పూతగాగ
తరగయంచులనంటి పరువులెత్తెడి నుర్వు పెదవిపై చిరునవ్వు వెల్లులనగ
కలహంస శుకపికీ గాన నిస్వనములు చెలికత్తియల జిల్గుపలుకులనగ.

కలికి నడకల యొయ్యారములుకబోసి
కాంతునిం జేరబోయెడి కాంతయటుల
అంబునిధి జేరి కలసిన దా ప్రభాస
తీర్థ సీమలందు సరస్వతీ స్రవంతి.

విలసత్ స్వాదువులైన నీరముల తన్పెన్ మమ్మిటన్ సర్వవే
ళల నీవాహిని యంచు వందనము తెల్పంబోవుచున్నట్లుగా
ఫలభారానత వృక్షముల్ శిరములన్ వాల్చెన్, మరు ద్వీచికా
చలితమ్ముల్ పువుతీవలున్ తలలుపెల్చెన్ వాల్చె నా యొడ్డులన్. 80

ఆడుచు బాడుచు బాలురు
కూడెద రావాహిని దరి కుతుకము మీఱన్
తోడయి యొక్కరి కొక్కరు
వేడుకగా చల్లనయిన వేళలయందున్.

ఆయేటియిసుక తీసుక
యే యేనుగుబోలు ప్రతిమ యెలమిదలిర్పన్
జేయుచు నావెంటనె పడ
ద్రోయుదు రాయేన్గు నచటి తోయములందున్.

కంటిమిగద యొక యేనుగు
జంటన్ మన యడవి దారి సందుల; దానిన్
గెంటించి దునుమగలిగిన
బంటెవడాయని తలతురు బాలురు తమలో.

ఆ తీర్థం బగణితనా
నాతరు సుమసురభిళ పవనప్రకరాంచత్
ఖ్యాతిం గడుసుందరమై
చేతోముదమొసగు నచటి జీవులకెల్లన్.

మానిత వృక్షరాజమహిమమ్మయి పొల్చు ప్రభాస తీర్థశో
భానుభవప్రమోదభరి తాంతరు లౌచు, విలాస వృత్తి త
త్కానన సీమ గ్రుమ్మరుచు క్రమ ఫలమ్ముల తేనె లానుచున్
వానరముఖ్యులెందరొ నివాసము సేయుదు రాస్థలమ్ములన్.

అంజన యన్న దోర్తు కల దావనసుందర దేశవాసియౌ
కుంజరు డన్న వానరునకున్ గడుగూర్చిన ముద్దుబిడ్డ, ఆ
కంజదళాక్షి యౌవన వికస్వర దేహవిలాసముల్ మనో
రంజకమై మనమ్ములు గరంచును చూపరు లెల్లవారికిన్.

వనచరకన్య యన్న యొకవాక్యమెకాని తదీయ రూపమ
త్యనుపమ కాంతిసంయుత ముదాత్తమనోహర విభ్రమంబునై
కనులకు వింతగొల్ప, పనిగట్టుక భూమికి వచ్చె నీమె యే
యనిమిషకాంతయో యనుచు నాత్మలనూహయొనర్తురెల్లరున్.

పూర్వ జన్మమందు పుంజిక స్థలయను
దేవకాంత యొకతె దివినివీడి
శాప కారణమున జన్మించె భువిపయి
అంజన యను పేర కుంజరునకు.

బలయుతుడగు భర్తనుగొని
బలవంతుడయిన తనయుని బడయగనెపుడున్
గలలం గాంచుచు నంజన
తలపోయుచు నుండు దేవుదయ్యకై మదిలో.

తనసుత అందము నెఱిగియు
తనసుత మనమున తనరెడు తలపు లెఱిగియున్
వినుత బలుండగు నల్లుం
గనుగొన కుంజరు డెడంద గలగుచునుండెన్. 90

ఇది యిట్లుండ,

కేసరిమదపుటేన్గులజంపుట

ఆవారిధి తీరమునం
దావాహిని తటమునగల యటవీ ప్రాంతం
బేవేళన్ ఖగమృగముల
కావాసమ్మయి తనరు నతిభయదంబై.

గములారోహిత పర్వతాగ్రము లనేకస్వీయసంతానసం
గములున్ నైజముఖోద్గతారవ సమగ్ర స్ఫోటి తాశావిభా
గములై గ్రుమ్మరు నామహాటవి నసంఖ్యాకమ్ములై నిత్యమున్
చమరీ సింహ మదేభ భల్ల శరభీ శార్దూల ఖడ్గౌఘముల్.

మదమున బలిసిన సింగపు
గొదమల, చదలంట నెదుగు కుజముల్లైనన్
మొదలంట గూల్చి, నదియం
దెదురీతల నీదు నచటి యేనుగుగున్నల్.

తొలగవు సింగపుగములకు,
తలగించును గిరుల నయిన దంతాగ్రములన్,
మలగక నెదిరిని పైకొని
కలహింపగ జూచు నచటి కలభము లెల్లన్

ఏన్గుగున్నలె మన్ను మిన్నెఱుగనట్టి.
ప్రబల సాహస విస్ఫార పాటవాతి
రేకమున విహరింప విశృంఖలముగ,
పలుకశక్యమె మదగజమ్ములను గూర్చి.

మ.కో.

ఉక్కు మీఱిన దేహపాటవ మూర్జితమ్ముగ జూపుచున్
లెక్క సేయక తక్కు జంతుల లేశమున్ పటుఘీంకృతిన్
పెక్కు రీతుల బోవు నావన వీధులందున నేనుగుల్
ప్రక్కప్రక్కల నక్కి స్రుక్కగ ప్రాణి సంతతులన్నియున్.

ఒకనాడున్మద భావజృంభిత మహాహుంకార ఘీంకార సం
ప్రకటాభీల పటుప్రతాప బలదుర్వారమ్ములై యానదీ
నికటమ్మందలి యూరు మీద పడియెన్ నిర్నిద్రనిర్మూలనా
త్మకకార్యారభటిన్; జనుల్ వెఱగునొందన్ రెండువేదండముల్.

గిరులన్ గొమ్ములజిమ్ము, నుద్ధతమదక్రీడాపరత్వమ్మునన్
ధరణింద్రొక్కు రసాతలమ్మునకు, దిగ్దంతావళశ్రేణిపై
కరుగం జూచును పోరి, కత్యధికదర్పాటోప విస్ఫూర్తి నా
కరియుగ్మం బతివిక్రమక్రమసముగ్రస్ఫూర్తిసంరంభమై-

ప్రబలభయంకరమ్ము లనివార్యగతిం దిరుగాడుచున్నవై
శబలము శంఖమన్ మదగజమ్ములు రెండవి, మౌనివాటికా
నబడిన జాలు వేపరువునం జని యార్చును హోమవహ్నులన్
గబగబ తత్కుటీరముల కాళులద్రొక్కి యడంచి కూల్చుచున్-

పెరికినయూపముల్ విసరివేయును దూరము దన్ని; నీరమున్
కరమున నింపి తెచ్చి జడిగా విరజిమ్మును యాగకుండముం
దఱిమిఱిజేయు నాస్థలము, లచ్చటవాసముసేయు మౌనులున్
పరువులుబెట్టి యాశ్రమనివాసములన్ విడనాడిపోవగా. 100

అట్లు విహరించు నేస్గుల కడ్డుతగులు
వీరవరుల గానక భయవిహ్వాలులయి
ప్రాణములు గుప్పిటం బట్టి పటురయమున
ఎల్లదెసలకు ప్రజలు పర్వెత్తుచుండ.

కుపితారుణముఖు డున్నత
విపులోరస్కుం డతిశయ వీరాకారుం
డపరిమిత స్థైర్యుం డొక
కపి వీరుం డచట కాలుకదపక నిలిచెన్.

దవుడన్ నొక్కిన చాలనట్టి బడుగీతం డెవ్వడీకోతి? దు
ర్వ్యవసాయంబున దారికడ్డముగ దానై వచ్చె నంచున్ మదో
ద్భవ కోపోద్ధత వారణద్వితయ ముద్దండోగ్ర హస్తమ్ములన్
ప్లవగోత్తంసుని మట్టుపెట్టుటకు నై పైపైకి రాబోవగా.

ఆవెరవున పైబడు దం
తావళముల తెన్నులరసి తత్కపియును తా
నావల కీవల కురుకుచు
నేవలనను పట్టువడక యేపుగ ద్రుటిలో.

వాలము ద్రిప్పి లేచుచు నభస్థలిపై కపలీలగా నవో
ద్వేల జవాతిరేక పటుతీవ్రతరోత్కట వృత్తిదోప న
య్యాలరి యేన్గుజంట పయి కద్భుత ధైర్యమెసంగ దూకెనా
భీల బలోగ్రు డాప్లవగ వీరు డకుంఠిత సాహసాత్ముడై-

కడు సూక్ష్మబుద్ధి యాకపి
అడరెడు కోపపు టుడుకున నాయేన్గులకే
యెడమీయక తడవీయక
వడివడిగా రాళ్ళు దెచ్చి పయి గుప్పించున్.

ఉరుకును కపి కరిశిరముల,
దొరకక లవమైన వాని తుండమ్ములకున్:
సరగున కపివరు చెఱగొన
కరులును తమచుట్టు తామె కదువడి దిరుగున్.

మనముల మునుకొను కినుకల
వనచరుడును వనగజములు పనవుచు పైపై
జనుచును తనువుల నెనడులు
గనుపడు దనుకను పెనగును కడకదలిర్చన్.

బలితపుటేన్గులు క్రిందై
బలహీనమ్మౌ కోతి పైబడి మీదై
బల బలహీనము లచ్చట
తలక్రిందై కనుల బడియె తద్దయు వింతై -

గుంద్రాతి యిసుమును గుప్పిళ్ళతో దెచ్చి కనులలో జిమ్మను కడకనెగిరి,
ఒకదంతిదంతమ్ము నొగిపట్టి యెక్కి వేఱొకదంతిదంతమ్ము నూడబెరుకు,
ఒకతుండముం బట్టి ఉరియక మెలివెట్టి వేఱొక్క దానితో బిగియ గట్టు,
ఒకదంతితోక వేఱొకదంతి తోకతో ముడివీడకుండంగ ముడిచి కట్టు,

పట్టుబడక మొండి పంతమ్ముతో కోతి
యొకటె చేయు వింతయుద్ధమునకు
బింకమిగిరిపోయి బెగడొంది వగజెందు
రెండు గజములకును గుండెలగిలె.

తోదకము

అందని యాకపి యారడి బెట్టన్
బందములన్ బడి బాధల లోనై
చిందులు ద్రొక్కుచు చేష్టలుదూలన్
క్రిందబడెన్ వడి రెండుగజమ్ముల్-

దుర్దాంతోరు బలాఢ్యు డాప్లవగ యోధుండొక్కడున్ విస్ఫురత్
దోర్దర్పమ్మున మోసితెచ్చి గిరులందున్ గల్గు పాషాణముల్
నిర్దాక్షిణ్య గుణప్రవృద్ధ బలవన్నిర్భిద్ర కోపోగ్రుడై
మర్దించెన్ పెనుప్రోవులై పడగ యామత్తేభ మాంసాస్థికల్.

రాజిత సద్గుణాఢ్యు డవిరామ తపోవ్రత నిష్ఠుడౌ భర
ద్వాజుడ టన్నమౌని, మదవారణయుగ్మము నట్లు సాహసో
త్తేజితు డైన యాకపి వధించిన యద్భుత మెల్లజూచి చే
తోజనిత ప్రమోదభరితుండయి యాతని కౌగిలించుచున్-

వాసిగ నీవొకండె మదవారణ యుగ్మము నిట్లనంత బా
హాసముదీర్ణశక్తి దునుమాడిన సింహ బలోగ్ర మూర్తివో
కీశకులాగ్రగణ్య, ఘనకీర్తిని పొందుమటంచు వానికిన్
కేసరి యన్న నామమిడి, కేలున వానిబుజమ్ము దట్టుచున్.

ఈవనసీమ కెల్లను కరీంద్రభయ మ్మెడబాపి నాడ వే
దే, వరమొండు త్వాదృశుల కిచ్చుట మాకొక గొప్పకాదు నీ
భావము నందెదేని గల వాంఛను దెల్పు మనంగ నామహా
దేవునకున్ నమస్కృతులు దీర్చుచు కేసరి నమ్రవాక్కులన్.

నిరుపమ సత్త్వుడు విద్యా
పరమేష్ఠియు భక్తుడు నగు వానిన్ సుతుగా
వర మీయుండని వేడగ
దరహాసమ్మున మునియును తథ్యమ్మనియెన్.

అతిభయోత్పాత వైపరీత్యమ్ము లడర
వారణము లట్టు లూరిపై బడుట జూచి
పారిపోయిన ప్లవగు లే పర్వతంపు
కొమ్మనందునొ యే చెట్టు కొసనొ డాగి-

ఒంటరిగ పోరి వన్యేభయుగము నచట
మట్టుపెట్టిన కపివీరు మహితశౌర్య
సాహసమ్ముల కలరుచు సంభ్రమమున
పరువులెత్తుచు వచ్చి కేసరిని జేరి -

ఈనా డింతటివాడు మానడుమ జన్మించెన్, భవిష్యమ్ము నం
దేనాడెవ్వరు చూడనట్టి ప్రముఖుం డేయొక్కడో పుట్టు నం
చానందమ్మున కేసరిన్ పొగడి యాప్రాంతమ్ము లూరేగి ర
వ్వానిన్ వారిబుజాల మోసికొని దీప్తస్వాంతు లవ్వానరుల్. 130

అంజనాకేసరుల వివాహము

కుతుకము హెచ్చె, కేసరిని కుంజరుడాయెడ జూచినంతనే;
అతిశయ శౌర్య సాహస సమన్వితు డాతని నల్లువానిగా
మతిదలపోసి, యంజనకు మానసమేగతి వానియందు సం
గతమగు నో యటంచు దనకామితసిద్ధికి నచ్చుటచ్చుటన్.

నలువురిముందును కేసరి
బలసాహసవిక్రమమును భవ్యాకృతియున్
పలుకుచు, నల్లిన నంజన
చెలులకు నెఱిగించు తనదు చిత్తమునతడున్.

వినినది మున్నే కేసరి
తనుదార్ఢ్య, మ్మాకపివరు దనముద మారన్
గనినది నేడంజన మే
నున నును పుల్కలు వొడమగ నూతనవాంఛన్-